## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000004521

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం నమో భగవతే వాసుదేవాయ

ఈశావాస్య — మాండూక్యములు

అను

# ఉపనిషద్ద్వయము

[ ఆంధ్ర వ్యాఖ్యానము ]



మహాకవి:

## శ్రీ కాశీభట్ట కృష్ణరాయప్రోక్తము

[వెల 2

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

# ఈ శా వా స్యో ప ని ష త్

ఓమ్ పూర్ణమదః పూర్ణమిదమ్ పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే.
ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఈ ఈశావాస్యోపనిషత్తు సర్వోపనిషత్తులకును శిరోమణి భూత మని ప్రాచీనకాలమునుండి సాంప్రదాయికముగ చెప్పుకొనుట కలదు. అల్పాచ్తరము పూర్వనిపాతము గావలయు ననెడి వ్యాకరణసూత్రాగ ఇంచుకు లేదు. అభ్యర్హితత్వమును స్వీకరింపనక్కరలేదు. ఏది ఎట్లయినను; ఈ యుపనిషత్తు సర్వప్రథమము. మహావాక్యములలో ఋగ్వేదాది క్రమమున గ్రహించినట్లు ఈయుపనిషత్తును గ్రహించినచో రెండవ స్థానమీయవలయును. స్థానవ్యామోహమును పాటించినయెడల "మాండూక్య మేకమేవాలం" అనెడు సంప్రదాయమునుబట్టి మాండూక్యమునకు ప్రథమస్థానమిత్తుమన్న ఆ మాండూక్యము ఆథర్వణిక మగుటచే చరమస్థానికము కావలసివచ్చును. స్థానాలంబనమును స్థాన భ్రంశమును పొందుటకంటె సంప్రదాయమును మన్నించుట సమంజస మని తోచెడిని. సాంప్రదాయికముగా ఈశావాస్యమే ప్రథమము. ఈ యుపనిషత్తునకు ప్రథమత్వము పాఠక్రమమునుబట్టియేగాక అర్థ క్రమమునుబట్టియు నిర్వహింపవలయును. ఈ యుపనిషత్తునందు; జీవ నిచద మగు తత్త్వమును తద్గ్రహణోపాయమును చక్కగ నిరూపింప బడెను. ఇందు పదునెనిమిది మంత్రములు కలవు. ఈమంత్రసంఖ్యలోను మతభేదమున్నను, మంత్రపాఠక్రమమునను మతభేదమున్నను, సంప్ర

దాయజ్ఞులు చాలమంది పదునెనిమిదింటినే గ్రహించుటవలన మంత్ర
సంఖ్యానిర్ణయము సాంప్రదాయికముగా పదునెనిమిది యనుటయే
మంచిది. ఈయుపనిషత్తు శుక్లయజుర్వేదమునకు సంబంధించినది. శుక్ల
యజుర్వేదము, తచ్ఛాఖీయులు, మనకు అప్రసక్తులు; విషయమే
ప్రధానము. ఈ యుపనిషత్తునందలి భాషయును దయామయుడై
బోధింపదలచిన మహాపురుషుని వాగ్ధోరణిలో నున్నది. ఇందు కథలును
రూపకములును మొదలగు వాగ్వైదగ్ధ్య ప్రదర్శనపర కేవల శిష్యచిత్త
ప్రసాదమునకే చెప్పబడినట్లు శైలినిబట్టి నిర్ణయింపవచ్చును. మరియును
ఉపనిషద్వాఙ్మయము క్షత్రియప్రబుద్ధమనియు బ్రాహ్మణవిరుద్ధమనియు
బ్రాహ్మణులుంగూడ క్షత్రియులయొద్ద నేర్చిరనియు, నీ మొదలగు
వర్ణాన్యోన్యవైషమ్య బీజస్థాపకములుగ కొందరు విమర్శించిరి. అదితప్పు.
జగద్వ్యాపారవిషయమునందు షోడశకర్మవ్యవహారములయందు తద్వ్యవ
స్థాపరిరక్షయందు వర్ణాశ్రమధర్మవ్యవహారముసంభవించుట న్యాయ్యము
గాని, ఆధ్యాత్మికవిద్యయం దిట్టిభేదముతో సంబంధములేదు. ఈ విద్యా
వంతులు విద్యావంశమువారై యుందురు. మనుస్మృతియందు విద్యాభ్యా
సము ఎవ్వనినుండి ఎవ్వడైనను గ్రహింపవచ్చునని యున్నది. మరియును,
ఏవిద్యనైనను పరిరక్షింపవలయునన్న పాలకాశ్రయము కావలసివచ్చును
గావున ఉపనిషద్వాఙ్మయమునందలి క్షత్రియులు పాలకక్షత్రియులుగాని,
జాతిక్షత్రియులు గారు. మనుస్మృతి మున్నగునవియును పాలకక్షత్రియ
ప్రబుద్ధములై నిలిచెను. ఇంతకును ఆధ్యాత్మిక విద్యావిషయమునం
దీభేదమును పెట్టుకొనుట ఆధ్యాత్మికవిద్యాదూరీకరణ దౌర్భాగ్యమే.
బ్రహ్మసూత్రములయందును, "హృద్యపేక్షయా మనుష్యాధికారిత్వాత్'
అనుప్రకరణము ప్రారంభింపబడెను. అన్నింటను వర్ణాశ్రమ వ్యవస్థా
పరిభాష వ్యాపించెననుట నిక్కమేగాని, అది పరమార్థముగాదు. చెట్టు
లలో చేమలలో రాళులలో రప్పలలో కప్పలలో రత్నములలో

మున్నగు సకలవస్తుజాతమునందు సర్వవ్యవస్థా పరిభాష వ్యాపించి యుండుట విజ్ఞు లెరుంగుదురు. అది తాత్త్వికముగాదుగదా! చారిత్రకులకు రచనాకౌతూహలము కలిగించిన కలిగింపనిండు. ఈ యుపనిషత్తునకు అధికారి శమదమాదిగుణసంపన్నుడేగాని యితరుడుగాడు. ఈ యుపనిషత్తునందు ప్రశ్నప్రత్యుత్తర ధోరణిలేదు. చక్కగ ఒకదివ్యబోధము చేసినట్లుండును.

ఉపనిషత్తననేమి? అని పూర్వమునుండియు శంకించుకొని సమాధానములు చెప్పుకొనుచునే యున్నారు. అట్టి శంకాసమాధానముల కవకాశము ఉపనిషత్తులయందే ఉపనిషచ్ఛబ్ద నిర్వచనముండినచో లేకుండును. అట్టి నిర్వచనము లేకపోవుటవలన 'ఉప+ని+షద్ల్' అని నిష్పన్నమయ్యెనని చెప్పుకొనవలసివచ్చెను. విజ్ఞులందరెరుంగుదురు. కాని ఉపనిషత్తులలోనే "ఇత్యుపనిషత్" "ఓమ్మిత్యుపనిషత్" ఇత్యాదిగ సర్వోత్కృష్ట బోధనాపారమ్యభావము సూచించునప్పుడు 'ఉపనిషత్' అనివాడుట కలదని వేదవేత్త లెరుంగుదురు. కావుననే ఉపనిషత్తన రహస్యమని కొందరు నిర్వచించిరి. ఏదియెట్లున్నను ఉపనిషత్తను శబ్దములో మూడుభాగములున్నట్లు కన్పట్టుచున్నవి.

'ఉప+ని+సత్' ఈమూడింటిలో కట్టకడపటి 'సత్' అనుశబ్దము వేదవేదాన్తములయం దున్నతభావ ఘనస్వరూపమును బోధించుటకు స్వీకరింపబడిన పారిభాషిక పదమువలె నిష్పాక్షికదృష్టితో నెట్టివారికి స్ఫురింపకపోదు. ఆ 'సత్' శబ్దమే మొదటిదనియు, అదియే సత్తనియు తదాధారముననే చిదానందములనియు ఆధ్యాత్మికులు వ్యవహరించిరి. తైత్తిరీయమునందు సద్రూపమును త్యద్రూపమును భిన్నభిన్నముగ వర్ణించి యభిన్నముగ సమన్వయించి సత్యము నిరూపింపబడెను. కావుననే సత్యములకు సత్యమనియు నిత్యములకు నిత్యమనియు (నిత్యో

నిత్యానామ్) మున్నగు నన్నిరూపక వాక్యములు గలవు. 'సత్ త్యత్' రూపమే సత్యము. (స త్త్యమ్) సత్యములోని త్యద్ — నిరూపము సత్య బోధకమైన నిత్యమయ్యెను. ఆ నిత్యసత్యస్వరూప నిరూపణ ముప నిషత్తులయందుండుట కావున ఉపనిష త్తనబడెను. (అ స్తీతిసత్. నితరాం అ స్తీతి నిషత్. ఉప, నిషత్ ఉపనిషత్.) ఈ యభిప్రాయమే యుప నిషత్తులకు కలిగియుండుటవలన బృహదారణ్యకమునందు, "నేత్యా దేశః" అని సర్వనిషిద్ధము బోధింపబడెను. "నేదం యదిద ముపాస తే" "యద్వాచావదతి తన్న బ్రహ్మ" ఇత్యాది నిషేధములును ఉపనిష ద్రూపమును బోధించుటకు చెప్పబడినవిగాని తిరస్కరింపబడుటకు చెప్ప బడలేదు. కావున నేవిషయము సర్వథా సత్యముగ బోధపడునో అవిషయమునకు మించిన యనిర్వచనీయమైన దివ్యస్వరూపము సత్యముని బోధించుటయే యుపనిషత్తుల పని.

ఈయుపనిషత్తునకు ఈశావాస్యోపనిష త్తని పేరు. ఈశోప నిష త్తనియుగూడ వేరొకనామము గలదు. కాని ఉపనిషన్నామ పరి పాటిలో "ఈశకేన" అని యుండుటవలన నీయుపనిషత్తునకు ఈశోప నిష త్తనుట సంప్రదాయోచితమనియును, "ఈశ్" అను శబ్దముయొక్క తృతీయైకవచన రూపము నామావళిలో గ్రహింపబడ లేదనియు నిబ్బరముగ చెప్పకొనవచ్చును. అగుంగాక! ప్రత్యుపనిషత్తునకును శాంతిమంత్రమని యుండుట యాచారము. దోషమే లేనియెడల శాంతికి ప్రసక్తి లేదు. కావున దోషమేదియో యున్నదని నిశ్చయించి శాంతిని గ్రహింపవలయును.

## దోషమేది?

మంత్రపాఠములను జదువునప్పుడు మననము చేయునప్పుడు అక్షరభ్రంశము పదభ్రంశము స్వరభ్రంశము మున్నగునవి కలుగుట

యొకదోషము. శాస్త్రార్థమును గ్రహించుటలో సాధారణముగ స్వాభి
నివేశానుకూల ప్రయత్నముగ నర్థము చెప్పుకొనుచుండుట నెడి దురా
గ్రహము వేరొకదోషము. మోహదోషము వాచకమునకు సాధన
మునకు మాత్రమే గ్రహించి, తనకు సమన్వయించుకొనక ఉపదేశ
పటుత్వముమాత్రము కలిగియుండుట మరొకదోషము. శాస్త్రార్థము
నందు సందేహము కలిగినప్పుడు నివారించుకొనుటకు నిష్కృత్యాది
మాత్రశరణము అయి శాంతిమంత్రమును విడుచుట యొండొకదోషము.
ఇట్టి యెల్లదోషములను ఉపశమింపజేసికొనుటకు శాంతిమంత్ర మవశ్య
పాఠ్యము. ఈశాంతిమంత్రమునందు తదుపనిషద్భావము సుగమముగ
బోధపడుటకునై ఉపక్రమోపసంహార రూపమున ఏకవాక్యతలో
ఇమడ్చబడి యున్నది. ఇందలి బోధము పూర్ణబోధమని పిలువబడును.
పూర్ణత్వమునందు ఖండత్వ మారోపించుటయే దోషమని చెప్పుచున్నది.
తద్రూపము పూర్ణము, ఇదంరూపము పూర్ణము. పూర్ణమునుండి వచ్చిన
దని వ్యవహరించుకొన్నది పూర్ణము. పూర్ణమని గ్రహించిన దాని
కంటెను పూర్ణ ముదీర్ణమై యుండును. పూర్ణేతరము ఏదియునుగాదు.
అణుపరిమాణమై, మహత్త్వమును మహీయమై సకలమునకు
సకలమై అఖండముగనుండునది పూర్ణము అని శాంతిమంత్రమున
కర్థము. ఈమంత్రాధారముననే యుపనిషత్తునకును అర్థము చెప్పుకొన
వలయును. ఈమంత్రము చక్కగ అవగాహన మగునెడల ద్వేషింప
దగున దేదియు నుండదు. సాంఖ్యులనుకొనినట్లు వివేకించిన నీప్రపంచము
సర్వము దుఃఖమేఅని దుఃఖరూపమునుగాంచక సర్వము బ్రహ్మమే అను
బ్రహ్మరూపమునే శాంతము. మరియును వైరాగ్యమని యొక
యాభాసపదము నపార్థముచేసికొని ప్రపంచమున గొందరు నైరాశ్య
ముతో నైరస్యముతో పెడవివరుపులతో ఈసంసారమింతే 'ఈ ప్రపంచ
ములో తల్లిలేదు తండ్రిలేదు బంధువులు సహోదరులు మొదలగువారు

లేరు మున్నగు వాక్యము లేవేవి కలవో యనుకొనెడి వైరాగ్యము వైరాగ్యము కాదు. అందరునుగలరు; అన్నియునున్నవి. కలుగునంతవరకు కలుగును; ఉండునంతవరకు నుండును. ఆకలుగుటయు పూర్ణమే — ఆయుండుటయు పూర్ణమే కాని, ఆకలుగుట, యుండుట, అనువాని కుదీర్ణమై పూర్ణము సర్వాధారమై సర్వము పూర్ణమై యుండుటంబట్టి నాస్తిత్వము నైరాశ్యము, నాశ్రయింపక బుద్ధియోగసంపన్నుడవై మెలగుమని బోధించుచున్నది.

# ౧. మంత్రము

హరిః ఓమ్. ఈశావాస్య మిదగ్ంసర్వం యత్కించ జగత్యాంజగత్
తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనమ్.

ఈ మంత్రమునందు సుందరములైన చిన్నచిన్న వాక్యములు గలవు. జగత్తునందలి జగత్తు, జగత్తును యీసర్వమును ఈశావాస్యమై యున్నది. ఈ వాక్య మవగాహనము కాగనే ఆ భగవద్విశ్వరూపము హృదయంగమముగ బోధపడును. ఇందలి జగచ్ఛబ్దమునందలి అగమాపాయిత్వమును (పోవుచువచ్చుచునుండుననుటను) మార్పులకూర్పే అని యనుటయును నొక్కమాటుగా మార్చి పరమరహస్యమైన ఈశావాస్యమును నిరూపించుచున్నాడు. ఈప్రపంచమునం దేదియు ననీశముగాదు. అనీశమనగా సంక్షుభితముకాదని యర్థము. ఈ ప్రపంచము సంక్షోభమయము గాదు. సంస్కారవిలాసము. ప్రపంచమునం దెట్టిదియును జాయమాన వర్ధమానాది వికారావస్థమని చెప్పుకొనుటకంటె జగత్స్వలనా ప్రకారమని ఈశప్రకారమని సంస్కారప్రకారమని భగవదనుగమనప్రకార

మని అనుకొనదగియుండుట జగద్ధారకమగు ధర్మరూపము గ్రహింపబడి యుండుటయేగాక ఆ ధర్మాధ్యక్షుఁడీశ్వరుఁడని తెలియఁబడును. ఈ సర్వ మీశావాస్యమని తనకు తెలియఁబడకున్న తనకు దీనితో సంబంధమేల యుండవలయు ననుశంక కలుగును. మరియును క్షణభంగురముగా గనుపట్టుచున్న దీనియం దేవగింపు పుట్టనీక ఈశావాస్యత్వమును తాండవింపజేయుచు శ్మశానవాటికయందుగూడ సాక్షాన్నటరాజసుందర నాట్య తాండవాది విలాసవిహారములను కనఁగొనవలసినయట్లు సర్వ ప్రకారములుగ భగవత్తత్త్వము విశ్వరూపముగను ఏకరూపముగను తదతిశయరూపముగను తెలిసికొనవలయునని ప్రారంభమున ప్రతిజ్ఞా వాక్యమును చెప్పుచున్నాఁడు. అట్టిదగుటచే విసువబడిన "త్యాగ భావము" తో భోగింపుము అని రెండవ వాక్యము నుపదేశించెను. మొదటివాక్యము తత్త్వనిరూపక వాక్యము. రెండవవాక్యము నిరూపితమగుదానిని సమన్వయించుకొను నుపాయబోధకమై ఉపదేశవాక్యముగ గ్రహింపవలయును. ఈరెండవవాక్యమునందలి 'త్యక్తేన' అను పదము సన్యాసపరమా సంసారపరమా అనిశంకింపనక్కఱలేదు. ఆసందేహము నివారించుటకే "భుంజీథాః" నీవు భోగింపుము అని చెప్పి యున్నాఁడు. కావున ఇది భోగసాధనాపరము. భోగ మెట్లుండవలయునో ఎట్లు భోగించవలయునో స్పష్టపరచెను. ఇందలి భోగశబ్దమునకు సుఖ భోగము మాత్రమని యర్థముగాదు. అనుభవింపవలసినదెల్ల భోగ వాచ్యమే. వేదాంత విజ్ఞానమునందునుగూడ త్యాగపూర్వకముగనే యనుభవింపవలయును. 'ఓమిత్యుపాస్య' అని యుపదేశించె నను కొనుడు. ఆ యుపదేశమువలన గ్రహింపబడినంత గ్రహించి అనుభవించి దానినివిడిచి తదతిశయత్వమును నిర్ణయించుకొనవలయును. భగవంతుని సమీపించినవాఁ డెప్పుడును ప్రణవనాదము వినునని యర్థముగాదు. భగవంతు డెప్పుడును ప్రణవనాదము చేసికొనుచుండునని యర్థముగాదు.

ఇదియే 'నేతి' వాదము యొక్క పరమార్థము. అట్లే ఈజగత్తునందును సర్వ త్యాగమునందే అనుభవము పొందవలయును. ఒకప్పుడు సుఖమే కలిగె ననుకొనుము. ఆ సుఖము త్యాగరూపముతోడనే యనుభవింపవలయును. అదియే ఫలత్యాగపూర్వ కానుభవము. ఫలము కలిగినను కలుగ కున్నను త్యాగపూర్వకముగ నుండుట అనుసాధన ముపదేశించు చున్నాడు. అట్టివానికి సుఖము కలిగినను స్వప్నప్రాయమే గావున దుఃఖహేతువుం గుండదు అట్లే సుఖహేతువులును ఉండవు. ఈ సుఖ దుఃఖద్వంద్వము లన్నియును నీశావాస్యములని మొదటనే ఎఱుంగుట వలన తనయనుభవములో సంక్షోభము కలుగదు. ఒకశిశువు రోదనము చేయుచున్నాడనుకొనుము. బాలునకది రోదనమే అయినను శైశ వేంద్రియబలాధానమగును (బాలానామ్ రోదనం బలమ్) కావున రోదనానుభవము బలప్రాభవము. అట్లే మరణము నవజన్మకారణము. జన్మము నవనవజీవనకారణము. వృద్ధాప్యమును పౌనఃపున్యముగా నవనవ త్వాపాదకములు. కావున సర్వము ప్రశస్తసుఖమై ప్రశస్తమై ప్రభు సమావాస్యమై యొప్పును. ఇందు ఓసాధకా! నీనెత్తిపై యేభారమును లేదు. ఆభారము ఆసారము ఆసంసారము ఆసంభారము ఎల్లదియు నీశా వాస్యమే. అట్లగుటవలన ఈశ్వరార్పితసర్వస్వుఁడవై యనుభవింప వలసిన దాని ననుభవింపుము. అనుభవింతునా? అనుభవింపనా? యని తహతహ పడకుము. సాధనాబీజమైన త్యాగరూపము చేయుబడెనా? లేదా? యని తహతహపడుము. త్యాగము కార్యము; ఇతరము భోజ్యము. గీతలయందలి "బ్రహ్మణ్యాధాయ కర్మాణి" అనియు "మత్కర్మకృత్ మత్పరమః" అనియు బోధించిన బోధముల మూలమే ఇందు మంత్ర రూపమున నిబంధింపబడెను. ఈ రెండు వాక్యములవలన ఈశ్వరుడు జగత్తు జీవుడు సాధకుడు ఈ నానాత్వమున నైక్యము సులువుగ బోధించెను. కాని మరియొక్క విషయము మిగిలెను. దానిని వివరించ

వలయు వీనినిమించవలయు ననెడు స్పర్థ సాధారణముగ వర్తమానుల కుండుటవలన ఆ స్పర్థ సాధింపదగినదియా? కాదా? ఒకధనికునిజూచి తాను ధనికుడు కావలయుననియు, ఒకబలవంతునిజూచి తాను బలవంతుడు కావలయుననియు, ఈ మొదలగు భావముల సమూహమే స్పర్థ యనబడును. ఆ స్పర్థ సర్వథా నిషిద్ధము. ఎవ్వనిసంపదను జూచి నీవు కంటగింపకుము. అసూయపడకుము. కాని నీమానసమున నీవు జాగరూకుడవై ఈశ్వరార్పితవృత్తితో అనుభవించుచుండిన ధనికత్వ బలవత్త్వాది సంపదలును స్వయముగ నీకనుభవయోగ్యములగును. ఒకచోరుడు బహుధనవంతుడై నీకగనబడెననుకొనుము. ఆ ధనికత్వము అధనికత్వసాధనము నీకాశ్రయణీయములు గావు. అధనుడవైన నీకు లాభములేదు. నీవన్నను జాగరూకుడవై న్యాయ్యసాధనములతో మెలగినచో నంతశీఘ్రముగ గాకున్నను సుస్థిరధనవంతుడ వగుదువు. అధనమే ధనము; అభోగమే భోగము. ఏలన, సర్వమీశావాస్యమగుట బట్టి స్పర్థాదులు సాధనములుగావు. స్పర్థవిడిచి ఈశ్వరార్పణ శ్రద్ధతో నుండిన నీవు సాధించినదెల్ల శాశ్వత కళ్యాణమయమై యుండును. విద్యార్థిదశలో ఒకబాలుని మించవలయునని వేరొకబాలుడు తలంచి చదువుటయనునది ప్రోత్సహింపదగినదని కొందరనుకొందురు. అదికల్ల. ఆభావమే అన్యోన్యాక్రమణమునకు నన్యోన్యవినాశమునకు మూల కారణమైనందున ప్రపంచమున ననేకసంక్షోభములు సమరరంగములు రణగుణధ్వానములు బయలుదేరినవి. ఛీ! స్పర్థయా? వృద్ధిసాధనము? భగవ చ్ఛ్రద్ధ, భగవదర్పితబుద్ధి, ఫలత్యాగపూర్వక కరణము, స్వధర్మనిర్వహణము యథోచితముగ గావించుట లోకకళ్యాణ కారకము.

ఈమంత్రము జగద్వ్యాపార నిర్వహణమునకు భూమిక. ఇంక ననంతరము సాధనారూపమును జెప్పుచున్నాడు.

# ౨. మంత్రము

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః ఏవం
త్వయి నాన్య థేతో ఽస్తి న కర్మ లిప్యతే నరే॥

తా॥ మొదటిమంత్రములోని మూడువాక్యములలో సర్వమును ఈశావాస్యమనియు యదృచ్ఛాలాభమున ననుభవింపు మనియు పరస్వత్వమును అసహింపకుమనియు నుపదేశించుటవలన జడభరతాదుల వలెనొకచో నచంచలముగ పడియుండుటయా? కర్తవ్య మేమైనగలదా? కర్తవ్యమే యుండినచో కర్తవ్యానంతర ఫలము ముఖ్యముగ ననుభోక్తవ్యమేగదా! అనుభోక్తవ్యమగునప్పుడు అనుభోక్తృత్వకర్తృత్వరూపభ్రమణ చక్రమునందు తగులుకొనుటయే పరమార్థమా? అదియే పరమార్థ మగు నెడల నీశావాస్య మగుటవలన కలిగెడులాభ మేమి? ఈశావాస్య మెప్పు డగునో తానుతత్త్వమున నీశావాస్యమేకదా ! అదియే తత్త్వమగు నప్పుడు ఈశావాస్యమను ఒక్కవాక్యము చెప్పుటతోడనే మిగిలిన దంతయు నిరాకరింపబడినట్లును, శ్రోతయగు తాను అస్వతంత్రుడైనట్లును, బోధపడునుకదా! అను ననేకసందేహములు పుట్టగ వానిని నివారించు చున్నాడు. తాత్త్వికవాక్యములు తార్కికజ్ఞానక్రీడావిశేషములకుగాదని నిశ్చయించుకొనవలయును. తాత్త్వికవాక్యము తత్త్వాన్వేషణోన్ముఖుని గావించుటకు చెప్పబడెనుగాని తర్కకౌశల ప్రదర్శనమునకు చెప్పబడలేదు. కావుననే రెండవమంత్రములో "ఏవంత్వయి". అను ప్రయోగమునందు ఏ మధ్యమపురుషము ఉద్దేశింపబడెనో ఆ మధ్యమపురుషముతోడనే అన్వయింపదగినయట్లు చెప్పుచున్నాడు. కాబట్టి యీ రెండుమంత్రములును ఏకనిర్దిష్టములేగాని జ్ఞాననిష్ఠ యొకటి ఇతరనిష్ఠ మింకొకటి అని విభాగించుట కవకాశము కానరాదు. ఈమంత్రమునందు శత సంవత్సర

ములు కర్మలను జేయుచు జీవింపగోరుము. ఈప్రకారమే నీయందుండును. వేఱ దన్యప్రకారము సుండదు. అట్లని కర్మలేపము నిన్నంటదు. అనెడు సూత్రప్రాయములైన చిన్న వాక్యములు గలవు. ఈవాక్యములలో మొదటివాక్యమునందు జీవుడు స్వతంత్రుడా అస్వతంత్రుడా అనునది నిరూపించెను. కర్మకరణమునందు స్వతంత్రుడై యుండినను కర్మకర్తృత్వమునందు స్వతంత్రుడు కాడని చెప్పియుండెను. జిజీవిషేత్, బ్రతుకుటకు కోరవలయు ననెడివాక్యమును తీసుకొని జీవితమునందు కోరిక గలవాడజ్ఞానియైన నట్టియజ్ఞానిని సంస్కరించుటకు రెండవమంత్రము చెప్పబడినదని యనుకొనుట దుర్ఘటితము. ఎట్టివారికిని జీవిత మిచ్ఛాధీనము కాదని ఎఱుకపడియే యున్నది. ప్రత్యేకముగ గురువులు చెప్ప నక్కరలేదు. ఇందలి ఇచ్ఛార్థము ఇచ్ఛాపర్యాయముగాక జీవింపవలయును. అనెడు నర్థమును జెప్పుకొనవలయును. అట్లు చెప్పుకొనకున్న జీవిత మిచ్ఛాధీనము అనెడు దుర్వాదము నమ్మతింపవలసివచ్చును. కావున ఎంతవరకు బ్రదుకుదువో అంతవరకును ధార్మికుడవై భగవదర్పితవృత్తిత్వమును గోరుమని ఉపదేశించుచున్నది. మరియును ఇచ్ఛకు స్వాతంత్ర్యము బ్రహ్మార్పణమునందు దప్ప నితరమునందు లేదని పరమరహస్యమును దెలుపుచున్నాడు. నడువవలయునని కోరిక యున్నను చరణహీనుడు నడువనేరడు. అట్లే ఏకోరికలును కరణవిహీనముగ సిద్ధింపనేరవు. కాని బ్రహ్మజిజ్ఞాస కరణాధీనముగాక స్వయంప్రకాశమగుటవలన నందే ప్రతివారికిని స్వాతంత్ర్యముకలదని బోధించుచున్నాడు. కర్తవై చేయుచు బ్రతుకుము. అనెడు వాక్యమిందులేదు. కర్తకాక చేయుము అని యుపదేశించుచున్నాడు. గీతలయందును "అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" అని చెప్పబడి యున్నది. అంతయు నీశావాస్యము గావున కర్త తానగుట పొసగదు. కర్తయే లేకున్న కరణము కర్మము సంభవమా? యని శంకింపనక్కఱ

లేదు. "ఒడ్డుపడుచున్నది" అను వాక్యములో పడుట అను చైతన్య సంకల్పము ఒడ్డునందు లేకున్నను పడుచున్నది అను వ్యాపారము ఎట్లు నిర్వహింపబడునో అట్లే తాను కర్తగాక కర్మలను చేయవలయును నని విశేషోపదేశమును చేయుచున్నాడు. వైదికోపదేశములయం దిట్టి యలౌకిక బోధము లుండకమానవు. "ద్వంద్వజ్ఞానమువలన భాగ్య కారణకల్పనాదురభినివేశమువలన గల్పించుకొనుటకు వీలు లేకున్నను సిద్ధాంతముగ కర్మలనుచేయుచు బ్రతుకవలెను. అని చెప్పుటవలన కర్మ కరణమునందలి ప్రవృత్తియే బోధించుచు కర్తృత్వ నివృత్తి ఈశా వాస్య మను వాక్యద్వారమున బోధించెను. ఇట్టియభిప్రాయమే గీతల యందును గలదు. "కుర్వ న్నాప్నోతి కిల్బిషం" "నజాతు తిష్ఠ త్యకర్మ కృత్" ఇత్యాదివాక్యములుగలవు. చేయబడవలసిన కర్మములను ధార్మికముగ ఈశ్వరార్పణముగ నిర్వహింపుమనుటయే ఈ వాక్యము నకు ముఖ్యతాత్పర్యము. ఈవాక్యమునందు 'ఏవ' 'ఇహ' అను రెండు శబ్దములును సంపూర్ణముగ సాధకతారణోపాయమును సూచించు చున్నవి. ఇందలి కర్మశబ్దము కేవలకర్మపరముగాక ధర్మపరమై యుండును. కర్మేంద్రియ వినియోగములేని కర్మలును కొన్ని గలవు. నిద్ర మొదలగునవి. మరియును ధర్మవిరహితములగు కర్మములు కర్మవాచ్యములు గావు. అతడు గుణవంతుడు అను నప్పుడు గుణశబ్దమునకు సద్గుణ మని యెట్లర్థమును చెప్పుకొన వలయునో కర్మలను చేయుచు బ్రతుకు మనునప్పుడును ధార్మి కములగు కర్మలను చేయుచు బ్రతుకు మను నర్థమును జెప్పుకొన వలయును. ఈవాక్యమునం దుండిన 'నూరేండ్లు' అను పదము ఆయు వును నియమించు నుద్దేశముతో చెప్పలేదు. ఎంతవరకు బ్రతుకునో అంత వరకు నని యర్థము; మరణపర్యంతమని యర్థము. అట్లుగాకున్న నూటికి మించిన యాయువు లోకానుభవమునం దుండుటబట్టి వాక్యమున కజ్ఞాన

మారోపింపవలసివచ్చును. ఈ వాక్యము సంఖ్య ఆయుర్దాయనిర్ణయ మప్రసక్తము గావున నేదియో యొకసంఖ్యను గ్రహించెను. ఆసంఖ్య సాంప్రదాయికము "జీవేమశరదాంశతం" ఇత్యాది వేదవాక్య సంప్రదాయమునుబట్టి చెప్పబడెను. కొందరు ఫలత్యాగపూర్వక కర్మలను చేయ వలయునన్న యర్థముతీసుకొని కామ్యకర్మములయొక్క కర్తవ్యత్వమును నిరాకరింతురు. అదితప్పు. కామ్యకర్మములైనను సద్విషయకములగుచో కర్తవ్యములే. అట్లుకాకున్న లోభప్రసక్తికి సదవకాశము కల్పించినవారమగుదుము. తటాకారామాదినిర్మాణములు కామ్యకర్మములుగ గ్రహింపబడినను ఆకామ్యకర్మకరణమునందలి కామ్యఫలాసంగము ఈశ్వరార్పణబుద్ధిగలవాని కుండదు. కావున కామ్యకర్మము త్యాజ్యము కాదు. అట్లయగుచో అన్నపానాది స్వీకరణమునకును మనకధికారము లేకపోవలసివచ్చును. పుష్టికామము లేకున్న అన్నభక్షణము పోసగదు. ఆరోగ్యకామములేకున్న ఔషధసేవన మంటదు. ఇట్లున్నయును కామ్యములయ్యు కామ్యమాత్రములుగాక నియతములుగ స్వధర్మములుగ భగవదర్పితవృత్తితో పాటింపవలయును. ధనికునకు తటాకాదులు బలిష్ఠునకు దుర్బలపరిరక్ష, ధనహీనునకు యథాశక్తిసేవ పరోపకారము భూతదయ మొదలగు సకలసద్భావములు సత్కర్మములు కరణీయములై యొప్పెడిని. నైమిత్తికకర్మలనుగూడ విడువరాదు. పర్వదినములయందుపవసించుట; మహాపురుష సమాగమమున కొన్ని నిత్యకర్మల యుల్లంఘనము, ఆపత్కాలములయందు కొన్ని పరధర్మముల యవలంబనము కర్తవ్యమగుట పొసగును. కావున నిత్యప్రార్థనము ధ్యానము జీవికానిర్వహణకార్యసాధనము. పైతృకకర్మములు దైవికకర్మములు తటాకారామాదికామ్యకర్మములు విడువక యథోచితముగ న్యాయ్యముగ యథాశక్తిగ నిర్వహింపవలయు నన్న పరమగంభీర తాత్పర్యము మొదటివాక్యమునందు గలదు.

రెండవవాక్యము "ఏవం త్వయి స్యాత్" అని ప్రత్యేకముగ గ్రహింపవలయును; నీయందు తగ్లెనుగును. అనగా, కర్మనిరాసమును కావించుటయే గాని మరణపర్యంతమును కర్మప్రవృత్తుడవై యుండి తీరును. పై వాక్యమునందు చెప్పిన క్రమమే నీయందానుగుణ ముండునని యర్థము. అట్లగుచో ఇక మోక్షము లేదా? జీవన్ముక్తత్వము లేదా? అని శంకింపనక్కరలేదు. పూర్వమే భగవద్గీత సర్వనివృత్తిత్వము నుపదేశించియున్నాడు కావున తత్ప్రాప్తియే మోక్షము; జీవన్ముక్తి. ఏతద్విలక్షణముగ ఎవ్వరేమి చెప్పినను అది వాగ్విదగ్ధి. మరివేరు కాదని "నాన్యథేతోఽస్తి" అని దృఢముగ చెప్పుచున్నాడు. ఇంతకు వేరుగ వేరొక స్థితి నీయందుండదని నిర్ణయించి చెప్పుటచే నికనైష్కర్మ్యము గగన కుసుమమే యని శంకించువాని సమాధానపరచుటకై యుత్తర వాక్యము ప్రారంభింపబడుచున్నది. "నకర్మణా నాభుక్తం క్షీయతే కర్మ" మున్నగు వాక్యతాత్పర్యములు గ్రహించినచో కర్మవలన మోక్షము లేదనియు, కర్మ జన్మకారణమనియు, కర్మ యనుభవించి తీరవలయుననియు కర్మజాత్యాయుర్భోగ లక్షణమనియు, వినుటవలన కలిగిన సంక్షోభమును నివారించుచున్నాడు. ఔను! ఈశ్వరార్పణబుద్ధి లేక ఇదియంతయు నీశావాస్యమని ఎరుంగక ఎవడహంకార విమూఢుడై యుండునో యట్టివాడు నైష్కర్మ్యమును పొందనేరడు. అట్టివాడు కర్మ చక్రమున నలిగిపోవును. మొదటిమంత్రము నన్వయించుకొనుచు రెండవ మంత్రములోని యుపదేశమును ఆచరణములోనికి బెట్టిన వాని కేకర్మ లేపమును లేదు. కావున జన్మాదిబంధములును లేవు. లేపరాహిత్యము వలన పాపమును లేదు. ఇదియే గీతలయందును "కుర్వన్నపి నలిప్యతే" అని స్పష్టముగ చెప్పబడియుండెను. 'న కర్మ లిప్యతే నరే' అను వాక్యమునందలి 'నరే' అను శబ్దమును గ్రహించి వివిధములుగ పెద్దలు వ్యాఖ్యానించుకొనిరి. ఈబోధము సర్వమానవకళ్యాణమునకు గావున

సర్వమానవోద్దిష్టము గావున, మానవవిషయమునందు కర్మలేపముండదు. అని స్పష్టముగ చెప్పియున్నాడు. ఇట్లు చెప్పుటవలన మఱియొక గూఢార్థ మును గ్రహింపగలుగుచున్నాము. మానవతత్త్వమును గోల్పోయిన మానవుడు, మానవుడు కాడనియు నాస్తికుడు కూడ మానవాకారమున నున్నను మానవుడు కాడనియు మానవేతర ప్రపంచమునకు కర్మలేప ముండుననియు స్పష్టపరచుచున్నాడు. కావుననే స్మృతిపురాణములు క్రూర ములగు వ్యాఘ్రములను జూచి క్రూరములగు వ్యాఘ్రములనే చెప్పినారు. కాని మానవలోకమున నట్లుగాక క్రూరులగు రాక్షసులకు సాధువగు ప్రహ్లాదుడు పుట్టును. అట్లే మానవగుణపరిణామము మారుచుండును మానవలోకముననే కర్మలేపాభావము కానవచ్చుచున్నది. ఒక అసాధువు నకు సాధువు పుట్టుట, ఒకసాధువునకు అసాధువు పుట్టుట కర్మలేపా లేపములు లేకుండుటను కాని మిగిలిన సృష్టిలో లేదు. ఈ రెండు మంత్ర ములవలన సృష్టియన నేమిటో ద్రష్టయన నెవ్వరో, సృష్టిద్రష్టల యన్యోన్య సంబంధమును తానెట్లు గ్రహించి నడుచుకొనవలయునో, అట్లు నడుచుకొనుటవలన, గూఢసాధభావములకు భంగము కలుగదో అను విషయము లెల్ల సంగ్రహముగ సమగ్రముగ ఉపదేశించెను.

## ౩. మంత్రము

అసుర్యా నామతేలోకా అంధేన తమసావృతాః తాగ్ంస్తే
ప్రేత్యాభి గచ్ఛంతి యే కేచాత్మహనోజనాః

తా॥ పై రెండుమంత్రములయందును బోధించిన విషయమును అవలంబింపకున్న కలిగెడు ప్రత్యవాయమును నీమంత్రమునందు సూచించు చున్నాడు. ఈమంత్రములో రెండు వాక్యములు గలవు. అసుర్యములైన

అంధములై కేవల తమస్సుచే ఆవరింపబడిన లోకములు కొన్ని గలవని మొదటి వాక్యము చెప్పుచున్నది. ఎవరు ఆత్మజ్ఞానవిహీనులై చెడుదురో అట్టివారు మరణానంతరము ఆపై లోకములను పొందుదురు సుమా! యని రెండవ వాక్యము గలదు. ఈ రెండు వాక్యములలో మొదటి వాక్యము, స్వవచోవ్యాఘాతముగ నున్నది. జగత్తునందలి జగత్తు ఈశావాస్యమని మొదటి మంత్రమున చెప్పబడెను. ఈ మంత్రమున అంధతమస్సుచే లోకము లావరింపబడినవి అనునప్పుడా లోకములు మాత్రమీశావాస్యములుగావా? యనెడు వ్యాఘాతము సంభవించును. 'లోక' శబ్దము జగత్పర్యాయమైనను ఇందలి లోకశబ్దము కేవలమానవాధిక పరమై యుండును. గీతలయందును సృష్టియంతయు దైవమనియు ఆసురమనియు విభాగింపబడియున్నది. ఆ యాసురసృష్టియే యీ మంత్రమునందలి 'అసుర్యాలోకములు'. శ్వసూకరాదిమూఢయోనిజన్మావస్థ యుపనిషత్తులయందును వర్ణింపబడియుండెను. ఆత్మజ్ఞానమునకు ప్రయత్నము గావింపని మానవుడు నిస్సంశయముగ నధోలోకములకు బోవునని యీమంత్రమునందు చెప్పుచున్నాడు. ఈమంత్రము అదృష్టఫలబోధక వాక్యము. కొన్ని దృష్టఫలములును మరికొన్ని యదృష్టఫలములును నై యుండును. ఈయౌషధమును సేవించిన మండల దినానంతరము మహారోగ్యభాగ్యము కల్గునని చెప్పిన యదృష్టఫలవిశ్వాసమును విడిచి మందు సేవింపనివా డెట్లు చెడునో యట్లే ఆత్మజ్ఞానవిహీనులకు గలుగు నదృష్టఫలమును మరణానంతరమున సూచించుచున్నాడు. మరణానంతర భోగవిషయములు నమ్మమన్నచో మరణపూర్వాస్తిత్వము గూడ నమ్మరాని దై పోవలసివచ్చును. మరియును స్వరూపము లేదనవలసివచ్చును. స్వరూపమే యున్నచో దానియొక్క సత్త్వమున కెప్పుడును భంగము రారాదు. తత్సత్త్వాధిష్ఠానమున విలసితమగు నట్టిదియును కేవలాభావమని వ్యవహరింపదగదు. అట్లు వ్యవహరించి

నచో నాకలోకము; ఆలోకమునందు నేనున్నాను యీా మొదలగు ననుభవములు విరుద్ధము లనవలసి వచ్చును. అట్లయున్నచో వారు గురువులు మేము శిష్యులము; వారు ప్రబోధించుచున్నారు మాకు ప్రబోధముగలుగు చున్నది యనెడు నీసర్వానుభవము ఆభాసమై మూలచ్ఛేదమునకు పాండిత్యము దిగిపోవును. కావున స్వవచోవ్యాఘాతము లేదు. గీతలయందును "మత్త ఏవ జ్ఞాన మపోహనంచ" అని స్పష్టముగ చెప్పియున్నాడు. అట్లగుటవలన అసుర్యములగు లోకములు గలవు. ఆలోకములీశావాస్యములయ్యు అసుర్యప్రబలములగుటవలన అసుర్యములని వ్యవహరింపబడుచున్నవి. రావణునిహృదయమునందు రాముడున్నను, రక్కసుడని వ్యవహరింపబడకమానడు. ఇంతకును సోపాధికముగ పందులను కుక్కలను మొదలగు వానిని మన మెఱుంగుదుము గదా! ఆజన్మములే ఆత్మజ్ఞానవిహీనునకు కలుగుననుటలో విప్రతిపత్తి లేశమునులేదు. మరియును, ఉపాధులయందు విలసితమైన చైతన్యమాత్రలక్షణము సర్వసాధారణము. మానవచైతన్య మెట్టిదో వృక్షచైతన్య మట్టిదియు. కాని వృక్షచైతన్యమునకును మానవచైతన్యమునకును జ్ఞానవిషయమే విశేషరూపముగ కన్పట్టుచున్నది. అట్లగుటవలన నీయుపాధులన్నియు లోకములుగ భావించి క్రమక్రమముగ నాత్మజ్ఞానమాత్ర జన్మస్వామ్య (Right by birth) ముగల మానవోపాధియందలి చైతన్యమునకు నాత్మజ్ఞానమే ముఖ్యము. అట్టి యాత్మజ్ఞానము లేకున్న మానవాధోగతికి పోవుననుటలో తర్కవిరోధమును లేదు. కావున ఆత్మజ్ఞానము ముఖ్యము. ఆత్మజ్ఞానమనగనే 'ఆత్మయేది? అనాత్మయేది? నిత్యమేది? అనిత్యమేది?' అని విమర్శించుకొనుటయే, విచారించుకొనుటయే, అని కొందరు నిర్ణయింతురు. ఆనిర్ణయ మాత్మజ్ఞానము కాదు. అదియేయగుచో అంతయు బ్రహ్మమే. అదికాదని గ్రహించినదెల్లయు మిథ్యయే యని రెండువాక్యములను జెప్పి సుళువుగ బ్రహ్మవిద్యోప

దేశము చేయుపచ్చును. మరియును ఆత్మ యిదియని ఒకడొకనికి చెప్ప నక్కరలేదు. ఆత్మయేలేకున్న వ్యవహరించుటయేయుండదు. నాశరీరము నశించి నాయాత్మ నిత్యమైయుండిపోవును యని ఆత్మనిత్యత్వము నెరింగి నంతమాత్రమున ఆత్మజ్ఞానము కానేరదు. ఆత్మయన నేది? అనాత్మయన నేది? ఈరెండింటిసంబంధమేలవచ్చెను? అనాత్మనుండి ఆత్మను వేరుపరచుట యెట్లు? వేరని నిర్ణయించుకొన్న వేరగునా? కేవలనిర్ణయముపై నాధార పడియున్నదా? మరియేదినైనను యుపాయాంతరమున్నదా యని శంకించి నిశితమైన ప్రయత్న మన్నివిధముల గావించుటయే ఆత్మజ్ఞానము. 'అహంబ్రహ్మ' అనిమాత్రము నిర్ణయించుకొన్న, తార్కికముగ బ్రహ్మ మగునని చెప్పకొన్నను 'అహమసత్' 'అహంశిలా' ఇత్యాది వాక్యము లను నిర్ణయించుకొన్న నసదాదిరూపములు నగునా? అసదాదులకు సత్త్వముండుటయెట్లు? నిర్ణయించుకొన్నను నిర్ణయింపకున్నను సత్తు నకే సత్త్వముగాని యసత్తునకు సత్త్వముండదు గాపున కేవలనిర్ణయా ధీన మనుకొనక కేవలవిచారాధీన మనుకొనక వ్యావహారికమునను ప్రాతి భాసికమునను పారమార్థికమునను ఏకాకారతను సమన్వయించుకొను టకు యత్నించుట ఆత్మజ్ఞాన మనబడును. కావుననే మొదట యిది యంతయు నీశావాస్యమని చెప్పి తరువాత త్యాగపూర్వకముగ ననుభ వింపుము; యెవ్వరిధనమును నాశింపకుము. బ్రతుకునంతకాలమును సత్క ర్మాచరణమును గావింపుము; మున్నగు బహూపదేశముల జేయుటవలన "బ్రహ్మసత్యము జగత్ మిథ్య" అను యీరెంటిని విచారించుటమాత్రము ఆత్మజ్ఞానముకాదు. ఆత్మదర్శనము ఆత్మశ్రవణము ఆత్మమననము ఆత్మ ధ్యానము యీమొదలగునవియెల్ల నుపనిషత్తులయం దుపదేశింపబడి యున్నవి. ఈ మహారోగమునకు ఈ మహామకరధ్వజము సంపూర్ణనివార కౌషధము అని ఎరిగినంత, రోగమెట్లు నివారణముకాదో యట్లు "బ్రహ్మ సత్యము జగత్తుమిథ్య" అని ఎరిగినంత మాత్రమున ఆత్మజ్ఞానములవడదు.

కావుననే గీతలయందును "ఉపదేక్ష్యంతి తేజ్ఞానం తత్త్వదర్శినః" అని చెప్ప బడియున్నది. జ్ఞానశబ్దమునకు అవబోధనము అన్న యర్థమే గ్రహించి నచో ఈచిక్కు వాటిల్లును. జ్ఞానమనగా సంయోజక విభాజకశక్తిసర్వథా సమన్వయింపబడుట. అట్టిజ్ఞానము కలుగవలయుననియే యుపనిషత్తులు బోధించుచున్నవి. కాబట్టియే "ఔపనిషదంపురుషంపృచ్ఛామః" అని సంప్రదాయముగలదుగాని "ఔపనిషదంజ్ఞానం" అనిలేదు. ఆస్వరూప మట్టిది కావుననే కేవలజ్ఞానరూపముగ చెప్పకొనక "సత్యం జ్ఞానం అనంతం" అని వ్యాపకముగ నుండవలయునని యెంచి తైత్తిరీయమునందు వర్ణింపబడెను. ఇంతయేల వేదపరిభాషలో కొన్నిపదములయర్థము వ్యాకర ణాదులచేగాక స్వతోనిర్వచనములచే స్వతఃప్రమాణములై యున్నవి. "వషట్ ఫట్ స్వాహా స్వధా" ప్రముఖశబ్దములు వేదైకగమ్యము లెట్లో జ్ఞానశబ్దముగూడ వేదవేద్యమైయుండును. వేదభాషలో చైతన్యలక్షణము నిరూపించునప్పుడు "ప్రాణము అపానము ఉదానము వ్యానము సమా నము" ఇత్యాదిగ బహుళముగ ప్రయోగించుచు "అన" అను ఒకధాతు భాగమును స్వీకరించియుండెను "జ్ఞః" అను శబ్దము ప్రత్యేకముగ ప్రత్య గాత్మకు ప్రయోగింపబడియుండెను. కావుననే ప్రజ్ఞానము బ్రహ్మమని మహా వాక్యములందు చెప్పబడెను. 'జ్ఞః' అను సంజ్ఞకలవానియొక్క లక్ష్యభూత మగునది పరబ్రహ్మమే కావుననేయే ప్రబోధములవలనను సాధనముల వలనను సన్నిహితముగ నత్యంతముగ బ్రహ్మప్రాప్తి కారణమో దానికి జ్ఞాన మని పేరు. ఈసంప్రదాయము వేదభాషనుబట్టి చెప్పకొనవలసి యుండును. కావున జ్ఞానమనగా విచారమాత్రముగాదు. విచార ప్రచా రాచరణములు మూడును జ్ఞానాంగములే. అట్టిసందేహమును నివారించు టకే రెండవమంత్రమునందు కర్మలను చేయుచునుండుమని యాదేశించు చున్నది. ధ్యానోపాసనాదులును కర్మవాచ్యములే. ఇట్టిపనులయందు ప్రమత్తుడగువాడు జ్ఞానహీను డనబడును. వాడే ఆత్మహత్య కావించిన

వాడు. అట్టివానికి పందిజన్మమో కుక్కజన్మమో వచ్చునని వేదపురుషుడు శాసించుచున్నాడు. ఈమంత్రమువలన ఆత్మజ్ఞానము యొక్క ప్రాశస్త్యము గ్రహింపబడును.

## ౪. మంత్రము

అనేజదేకంమనసో జవీయోనైనద్దేవాఆప్నువన్ పూర్వమర్షత్
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వాదధాతి॥

తా॥ పైమూడుమంత్రములయందును ప్రతిజ్ఞావాక్యము ఉపదేశవాక్యము ప్రశంసావాక్యము ప్రత్యవాయ వాక్యములను చెప్పి వేదపురుషు డగుటచేఁబట్టి ఆ మహాదివ్యరసానుభూతినుండి విడివడుట కష్టము గావున రసలోలుపుడై శుద్ధసమయస్వరూపమును నిరూపించుచున్నాడు. ఇందలివాక్యములు చాల వింతగనుండును. "(1) అనేజత్ (2) ఏకమ్ (3) మనసః జవీయః (4) నదేవాః ఏనత్ అప్నువన్ (5) పూర్వం అర్షత్ (6) తద్ధావతః అన్యాన్ అత్యేతి (7) తిష్ఠత్ (8) తస్మిన్ అపః మాతరిశ్వాచదధాతి." ఈ ఎనిమిది వాక్యములును తత్త్వనిరూపకములై యున్నవి. ఉపనిషదారంభమునందు ఈశః అని పుంస్త్వము వివక్షింపబడి ఈమంత్రమునందు లింగవ్యత్యయముతో వర్ణించుటవలన నన్యోన్యసంబంధము లేదనుకొనగూడదు. లింగవ్యత్యయము మార్షమని సంప్రదాయము. ఆతత్త్వము అనేజత్తు అనగా అచంచలము, అచంచలమని చెప్పుటవలన లోకమునవేది యాశ్రయించినను చంచలమని యందరి యనుభవములో నున్నది. కాని యిదిమాత్రమాశ్రయింపబడిన నెన్నడును చలించునదికాదు. గీతలయందును స్వల్పమైనను

మహాభయమునుండి రక్షించునని చెప్పియున్నాడు. ఏది తెలియబడిన మరిసందేహముండదో ఏ ఏకవిజ్ఞానమువలన సర్వవిజ్ఞానము సంభవమో యా దివ్యతత్త్వ మచంచలమైయున్నదని తన్నిత్యస్వరూపమును వర్ణించెను. మహాపర్వతాదులు అచంచలములైన ట్లనుభవింపబడుచున్నవి. అట్టి యచాంచల్యముగాక ఏకమైన, యచాంచల్యమని పునర్విశేషణముచే విశేషించి చెప్పుచున్నాడు. ఇందలి ఏకశబ్దము కైవల్యమై పూర్ణమై అఖండమై యుండునది. ఏది స్వగత సజాతీయ విజాతీయ రూపభేద రహితమో అది ఏకమని పిలువబడును. అట్టి ఏకవిజ్ఞానము వలన సర్వవిజ్ఞానముకలుగుటయే యిందలి విశేషము. ఏనుగుతుండమును బట్టి ఏనుగుతోకనుబట్టి తుండమే ఏనుగుతోకయే ఏనుగు యని చెప్పకొనెడిరీతిగాక యీజ్ఞానము యెంతమాత్రమైనను అఖండమై యొప్పును. ఖండముగ గ్రహింపబడుటకు వీలులేనిజ్ఞానము. అట్లైయగుచోనిక మనస్సునకు సరిగ మననయోగ్య మగునదికాదేమోఅను సందేహము నివారించుటకు "మనస్సుకంటె వేగముగలది" అని వర్ణించెను. "యతోవాచః నివర్తంతే అప్రాప్యమనసాసహ" అని చెప్పబడిన రూపమున తత్తత్త్వమున్నది. కాని ఆ తత్త్వము కేవలమానసికము కేవలవాచోవిధేయము అని యనుకొనుట తప్పు. మనస్సు ఎంత వరకు గ్రహింపగలుగునో అంతవరకునుండి తదతిశయరూపముననుండునని చెప్పుటయే ఇక్కడ ప్రధానముగాని మననము చేయబడునది కాదని యనుట ప్రధానముకాదు. "యన్మనసామనుతే తన్నబ్రహ్మ" అని లేదా అని యందురేమో ఈశ్రుతికి తాత్పర్యము మంతవ్యత్వము గాదని చెప్పుటగాదు. మంతవ్యత్వము గాదనుటయే తాత్పర్య మగునెడల "మంతవ్యః" అని 'తవ్య' ప్రత్యయముతో వేరొకచో నుపదేశింపము. మంతవ్యత్వ మున్నను మంతవ్యాతిశయరూపము నిరూపించుటయే తాత్పర్యము. ఇట్లు తాత్పర్యము. చెప్పకొనకున్న పరి

చ్ఛేదక పరిచ్ఛేద్యరూపదోషము వచ్చును. కావున మనసునకు మించి నదిగానే యున్నది. దీనిని దేవతలును పొందలేదని విశేషించి చెప్పు చున్నది. దేవశబ్దమునకు సాత్త్వికప్రవృత్తియని యర్థము చెప్పుటయో జ్ఞానేంద్రియములని యర్థము చెప్పుటయో పొసగియుండినను. 'దేవాః' అని దేవశబ్దమే యుండుటంబట్టి దేవతలే యనుకొన్నను నష్టములేదు. శిష్యునకు బ్రహ్మాదిదేవతలు తత్త్వగ్రహణమున సమర్థులేమో యని సందేహించి తత్తల్లోకములను సాధించుటకు నేవియో యదృష్ట ఫలకములగు కర్మల నాచరించుచు జ్ఞానవిషయమును తృణీకరించి జ్ఞానోపదేష్టలగు తత్త్వదర్శుల నాశ్రయింపక గురువులయెడల జూపవలసిన సర్వాధికభావము నలవరచుకొనక పాడగునేమోయని ఆదేవతలుగూడ ఆతత్త్వమును నెరుంగజాలరుసుమాయని ఉపదేశించెను. "దేవోనజాతి కుతోమనుష్యః" అనెడు కైముతికన్యాయ్య మిటబట్టదు. తత్త్వమెరుంగు టలో మానవులును దేవతలును సమానులేసుమా! అని సామ్యము కొరకు చెప్పియున్నాడు. ఇట్టిసామ్యము చెప్పిననే మానవలోకమునందే జ్ఞానపిపాసయుదయించి తత్త్వదర్శిని జేరగలడు. కావుననే "ఇహాచే దవేదీత్ మహతీవినష్టిః" యని శ్రుతిఘోషించుచున్నది. ఈజన్మమునసే తత్త్వజ్ఞుడు గావలయునని చెప్పుచున్నది. 'ప్రేత్యఅభిగచ్ఛంతి' అని యనుటవలన ప్రేతభావపూర్వముననే తత్త్వసుప్రీతుడుగావలయును అని యర్థవాదమున బోధించుటకే దీనిని దేవతలు పొందజాలరుయని చెప్పి యుండెను. ఈతత్త్వము తెలియబడినతరువాత నుండునదియు తెలియ బడకమున్ను లేనిదనియు సందేహించునేమోయని సుదృఢముగ తెలియబడినను తెలియబడకున్నను, తెలియబడదగినదని వేరొక వాక్యమును ప్రారంభించెను. "పూర్వమేయున్నది." అన్ని యుపనిషత్తు లును "పూర్వము సత్తేయున్నది. ఉన్నదొక్కసత్తే" అని ముక్త కంఠముగ చెప్పుచున్నవి. పూర్వాపరము లనెడు కాలవిభాగము

ప్రధానముగాదు. సద్రూపముయొక్క నిత్యత్వబోధమే ప్రధానము. భూగర్భమున సువర్ణఖనియొకడు కనుగొనెననుకొనుడు. కనుగొనిన తరువాతనే గనియొక్క యునికి సంభవించెననుటతప్పుగాదా! భూమికి ఆకర్షణశక్తిగలదు అని కనుగొనినతరువాతనే ఆకర్షణశక్తి కలిగి యుండెననుటతప్పుగాదా? అట్లే ఆ సత్తత్త్వము యెప్పుడునుండునదే. అట్లగుటవలన వెనుకలేదుకాబోలు ముందున్నదికాబోలు నని దేశకాలాదికృతభేదజ్ఞానము నాశ్రయించి యన్వేషించువారి కందరకును అందరానిదియై బహుదూరమైన ట్లుండును. అని వేరొకవాక్యము నుపదేశించుచున్నాడు. ఈవాక్యమువలన యెవరు వెనుకవెన్నాడుదురో కాశిలోనున్నదో, గయలోనున్నదో కేదారంబుననున్నదో, గుహలలోనున్నదో, అడవులలోనున్నదో అని యనుకొనుచు అటునిటు తిరుగాడువారికి అందరానిదని స్పష్టపరచుచున్నాడు. అట్లగుటవలన ఏదేశముననైన ఏక్షణముననైన తత్తత్త్వ మవగాహనమగు నని యభయ మిచ్చుచున్నాడు. "ఈగ్రామములోనున్నయది పొసగదు, ఈవృత్తిలో నున్న ఇదికుదురదు. ఈదేహముతో ఇది సంభవముగాదు అని అలసులై మందులై ఆత్మజ్ఞానదూరులుకాకుడు" అని హెచ్చరించుచున్నది. అట్లే దూరదూరమైపోవునా లేక ఎక్కడ నైనను సిద్ధమగునా యనుదానిని స్పష్టముగ "తత్ తిష్ఠత్ అస్తి" అని ఆతత్త్వమెప్పుడును ఒక్కలాగు నిలిచియుండునది అని బోధించెను. కావుననే దానియందే ఆయధిష్ఠానమునందే సర్వప్రతిష్ఠయుగలదని దానియందు నీరు గాలి నిలిచియున్నదని కడపటివాక్యమును చెప్పుచున్నాడు. ఇందుపయోగింపబడిన నీరో గాలియో సకలభూతముల కుపలక్షణముగ గ్రహించి మిగిలినదానిని పారిభాషికముగ అర్థమును జేసికొనవలయును. నీరు కర్మవాచకమని వేదసంప్రదాయజ్ఞులు నిర్వచించుటచే కర్మలు కర్మఫలభూతములు ఎల్లదియు ఆయధిష్ఠానమునందే ప్రతిష్ఠింపబడినవని యుప

సంహరించుచున్నాడు. అట్లుపసంహరించుట వలన కర్మలయొక్క సత్త్వస్వరూపము బ్రహ్మాధీనమై యుండుటవలన దార్శనికముగగూడ బ్రహ్మార్పణముగ గర్మములను గావింపవలయునుననెడి బోధము పునరుద్బుద్ధమగుచున్నది. గీతలందుంగూను "కర్మబ్రహ్మోద్భవంవిద్ధి" ఇత్యాదిగవర్ణింపబడెను. ఇంతయేల అన్నిటికంటె తత్త్వజ్ఞానప్రయత్నమొకటియే సుగమము సుఖము సూపపాదములని ప్రశంసించెను.

## ౫. ఐదవ మంత్రము

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే। తదంతరస్య
సర్వస్య తదు సర్వస్యాస్యబాహ్యతః॥

తా॥ పూర్వమంత్రమునందు చెప్పబడిన లక్షణము లత్యంతైకాంతికములు అని యనుకొనరాదని తద్విలక్షణముగ ఈమంత్రమునందు నిర్వచించుచున్నాడు. ఇదియే ఇందలి విశేషము. తార్కికులు ఒక వస్తువున కొకధర్మమే యుండవలయునని నియమించు కొన్నను ఆవాగ్వ్యాదగ్ధనియమములకు లొంగనిదని ఇందు వర్ణించుచున్నాడు. ఆ పరమతత్త్వ మిదమిత్థమని నిరూపింప దలచుట 'దిద్ధడబిద్ధయుద్ధ' మే.

"To define God is to defy Him—"

అయినను శాఖాచంద్ర న్యాయ్యమున చెప్పుట పరిపాటి. ఆ తత్త్వము చలకమును అచలకమును నైయున్నది. కేవలాచంచలమే యన్నచో స్థాణుప్రాయమనెడి భ్రాంతికలుగును. కాబట్టి చలనాచలనంబు లెల్ల తన్నిహితములని లక్షణాంతరములం జూపుచున్నాడు. దూరమున

నుండునదియు అత్యంత సమీపముననుండునదియు అగునని వ్యాప్తి లక్షణము నిరూపించు చున్నాడు. ఎట్ల ఎదుటను గోచరించునో అత్యంత సమీపమునను బహుదూరమునను ఉండగలుగు విలక్షణ సర్వవ్యాపకతయు ఆ తత్త్వమునకని చెప్పుచున్నాడు. అట్లు చెప్పుటవలన దేశకాలాది వస్తు భేదముల వలన కలిగిన రాగద్వేషాదులకు ప్రసక్తి సంభవించదు. ఒక డడవికిపోయి తపస్సుగావించి చిరకాలముండె ననుకొనుము. అడవికి బోయెనుగావున అది యుండనేరదని నిర్ణయించుకొనరాదు. కూపస్థ మండూకమువలె వేరొకడు ఒక్కచోటనే యుండెననుకొనుము. కొండలు కొండలం బట్టి గుహాలకుంబోయి కష్టింపలేదు గావున వానికా తత్త్వము గ్రహింపలేదని యనదగదు. గ్రహించువా డెట్టివాడైన గ్రహించును. మరి యును తనవారు తన్ననుసరించువారు గ్రహించిరనియు పెరవారు తన్ను ప్రతికూలించువారు గ్రహింపలేదనియు అనుకొనుటతప్పు. తనవాడైన పెరవాడైనా అనుకూలుడైనా ప్రతికూలుడైనా గ్రహించుట కవ కాశము గలవాడేయగును. కొందరకు కాలభేదమునంగాని పట్టదు. కొందరకు దేశభేదమునంగాని గిట్టదు. ఇట్టివేవియో బాహిరభేదము లున్నవని సంకోచింపనక్కరలేదు. ఆ తత్త్వముయొక్క సర్వవ్యాపక రూపము దుర్నిరూపమై యుండునని లోపల వెలుపల భూతముల యందు కాలమునందు దిక్కులయందు భావమునందు అభావమునందు నన్నింటను నొక్కరీతి యుండగలిగిన దిది యొక్కటే యని చెప్పి తత్సాధనారూపమును చెప్పుటకు ప్రారంభించుచున్నాడు.

# ౬. మంత్రము

యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే॥

తా॥ ఈమంత్రమునందు ముఖ్యమగు వాక్యము 'నవిజుగుప్సతే' అనునది. ఏవిషయమును జుగుప్సాకరముగ భావింపక కేవలాత్మ విలాస మని వివేకించు దివ్యోపాసకుడు పరమాత్మ తత్త్వాను సంధాతయై యెప్పుడు నుండును. వేయేల క్షయమాత్రస్థానమైన స్మశాన వాటికయందును తాండవక్రీడా విశేషములను గావించు పౌరాణిక నటరాజోద్దేశము సంపూర్ణముగ అభ్యుదయ సూచకమై యుండవల యును కావుననే ప్రపంచమునందలి సకలవస్తుజాలమునందును, ఎల్ల భూతములయందును సకలభావనములయందును భాగవత దివ్యస్వరూ పాను సంధానము కావించుచో ద్వేష్యమనియు ప్రియమనియు సహ్య మనియు విసహ్యమనియు అనెడు యీద్వంద్వభావములకు లోనుగాక అదియంతయును ఆత్మవిలాసమేయని యెఱుంగును. అట్లగునాడు తనకు శోక కారణము కానరాక జననమరణరూపములు సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములన్నియును క్రీడాసమయమునందలి పాదవిన్యాస ములవంటివే యని నిశ్చయించి వానివలనకలిగెడి సంక్షోభములను దూరము కావించుకొనగలడు. సకలభూతములును ఆత్మయందున్నవి. అనెడు వాక్యమునకు ఎల్లదియును ఆత్మీయ మేయను మహావిషయము బోధించుచున్నాడు. అట్లగుటవలన భూతదయ మైత్రి కరుణ మున్నగు దైవీగుణసంపద హెచ్చుటయేగాక సత్యముగ సర్వత్ర ఆత్మసాక్షాత్కార మనుభవింపగలడు. అనేకము అనివ్యవహారించుచున్న భావనయందు

నిజముగ ఏకత్వమే యున్నదని గ్రహింపబడును. ఒకటి యున్ననూ అన్ననూ
ఆరెండింటను గలిగిన గణనాయూపాధానము ఏకస్వరూపమే. ఒకటి ఒకటి
యయ్యెను నూఱునూఱు లోకట్లయ్యెను కదా! కనుక భూతము అనునది
భావమే. భావము కాని భూతము లేదు. భావము భావనారూపము. భావ
నము ఆత్మస్వరూపము. ఆత్మలేకున్న భావము భావనము భూతము అనున
దేదియునుండదు. అట్లగుటచే ఎల్లభూతము ఆత్మయందధిష్ఠింపబడియున్నది.
మరియును సకలభూతముల యందును ఆత్మనే చూడవలయును అని
యనుటవలన భూతములయందు ఆత్మ యున్నదని ఆత్మ, భూతములయొక్క
అన్యోన్యావినాభావ సంబంధమును శిష్యహృదయమునకు నచ్చునట్లు
బోధార్థము స్వీకరింపబడిన ద్వైతము గాని నిజముగ ఆత్మైక విలాసమని
సర్వమని నిశ్చయింపను కొనవలయును. ఈ యభిప్రాయమునే గీతల
యందును చెప్పియున్నారు. "ఆత్మరతి ఆత్మతృప్తి ఆత్మన్యేవాత్మనా
తుష్టః ఆత్మ తృప్తశ్చమానవః" అని నిత్యతృప్తిని ఆత్మైకత్వదర్శ
నమునందున్నదని చెప్పియున్నారు. ఇంతకును యీమంత్రము మొదటి
మంత్రములోని "మాగృధః కస్యస్విద్ధనమ్" అనువాక్యమునకు వ్యాఖ్యాన
ప్రాయముగ నుండవలయునని చెప్పబడెను. ఆశ అనూయ మొదలగు
నానావస్తు జాతములయందలి యన్యోన్య సంక్షోభ మూలకారణమైన
దుర్భావత్యాగము సుదృఢముగ నుపదేశించుచున్నది. దీనినిబట్టి "దేవు
డెక్కడనులేడు; నీలోనున్నాడు" అని సూక్ష్మనిర్ణయమును చేసికొనక
నీయందును నాయందును స్థావరములయందును జంగమముల యందును
అన్నింటికి అన్నియై అన్నింటిని మించి అలౌకికమైన ఏకస్వరూపమున
దేవుడున్నాడు" అని నిశ్చయించుకొనవలెను. కావుననే "ఈశావాస్య
మిదగ్ం సర్వం" అని స్పష్టముగ సర్వము భగవద్రూపము ప్రతిజ్ఞ
చేసియున్నాడు. మరియును గీతలయందును "భూతభృత్ నచ భూతస్థః"
అని నొక్కిచెప్పెను. భూతములయందుండువాడను కాను. భూతములన్ను

భాసించునాఁడ నని బోధియుద్ధాను. ఈ నిర్ణయము నెఱుంగుటవలన నాయందు జీవులున్నారనెడి సద్భావములోని నిగూఢమైన ఆ సద్భావదురహంకార దుష్ప్రభావములు త్యాజ్యములని చక్కఁగ ధ్వనింపజేయుచున్నాఁడు. మఱియును, మానవసేవయే మాధవసేవయనుచు, భూతదయగాఁ పుణ్యకార్యమనుచు, ఆధునాతనైతిక సూత్రముల నల్లుకొని ఆ యుక్తులతో తెగులొన్నుట కంటె ఆ భాగవత దివ్యస్వరూపమును అనుసంధానించుచు దివ్యసాధనమును మానవసేవ భూతదయా విలక్షణమైన దానిని అవలంబింపవలసి యుండుట నెఱుంగ వలయును. నీతికి హితముగ నున్నదని కొన్ని నిర్ణయములు పామర రంజకములుగ నుండవచ్చును గాని పరమార్థములు గావు. నీతిమంతులై బుద్ధియోగ సంపన్నులై సంచరింప వలయును. ఒక్క మానవమే మాధవము కాదుగదా! మానవము పాశవము జాంతవము పార్థివము అపార్థివము దృశ్యము అదృశ్యము సర్వము మాధవమని జ్ఞప్తియుంచుకొనుము. తత్కాలనీతులను పాటింపవలదని చెప్పలేను. అదియే పరమసాధన మనెడి ఏకాంతికదుర్వాదమును దూరీకరింపవలయును. ప్రవృత్తియందు నివృత్తియు, నివృత్తియందు ప్రవృత్తియు చక్కఁగ సమన్వయించుకొనవలయును. నేను భూతములయందు లేను అని చెప్పబడిన వాక్యము వలన నేను భూతమాత్ర పరిచ్ఛిన్నుఁడనుగాను అని యర్థము. ఇట్లుపన్యసించుటవలన జిజ్ఞాసువునకు ప్రపంచమునం దసూయపుట్టక ప్రపంచమెల్ల భగవద్దివ్యాలయమై యీ ప్రపంచజీవయాత్ర భగవద్దివ్యయాత్రగా మారగలదు. ఇట్టి మహాయజ్ఞమునకు సాధనము పరికరములు అధికారి కొదగు విషయములు ముందు చెప్పుచున్నాఁడు. అయినను ఆత్మానుదర్శనము ఆత్మభూతాన్వయము ఈ రెండింటి నుపన్యసించుటవలననే సాధనాదులు గ్రహింపబడుచున్నవి. ఆత్మ దర్శింపబడవలయును, వినబడవలయును; మననము చేయబడవలయును; ధ్యానింపబడవలయునని స్పష్టముగ

ఏకధోరణిని ఉపదేశించిన దర్శన శ్రవణ మనన ధ్యానాదులు ముఖ్యసాధ
నములు. వానిని విడువరాదు. ఈమంత్రము సమూహమున ఆత్మజ్ఞాన
మున ప్రవృత్తియు జగుప్సాకారణమునందు నివృత్తియు బోధించు
చున్నది. అట్లు బోధించుటవలన ప్రపంచవ్యవహార నిర్వాహణమునకు
అవలంబింప బడవలసిన యే ప్రవృత్తియును ఆత్మదర్శనమున అడ్డంకి
కారాదని అభయమిచ్చుచున్నాడు. గృహస్థుడై ఆలుబిడ్డలతో ఆప్తసం
పదలతో అణగి మణగి పెనగి బాధపడుటకంటె సుఖముగనొక్కడై
"సన్యాసి"యై యుండవలయుననుకొనెడి వెఱ్ఱితనము విడువవలయును.
సంసారికైనను సన్యాసికైనను ఏప్రవృత్తియున్నను ఏవయస్సునం
దున్నను స్త్రీయైనను పురుషుడైనను యే వర్ణాశ్రమ ధర్మములయం
దున్నను యే దేశములయందున్నను ధార్మికమైన జీవయాత్ర నడిపించు
కొనుచు బుద్ధియోగ సంపన్నుడగువాడు సర్వదా ఆత్మసాక్షాత్కా
రానుభవము కలవాడే యగును.

## ౭. మంత్రము

యస్మిన్ సర్వాణిభూతాని ఆత్మైవాభూద్విజానతః
తత్రకో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః॥

తా॥ ఈమంత్రమునందు ఏకత్వానుదర్శనము ముఖ్యముగ నుప
న్యసింపబడెను. ఆఏకము సత్యమైసర్వమై బ్రహ్మమై భాగవతమై యుండు
నది యగుటవలన జుగుప్సాకారణము కారాదని మున్నే యుపదేశిం
చెను. ఈఏకత్వానుదర్శన మాధారముగ చేసికొని యంతయు నసత్యము
ఏకమే సత్యము అని అద్వైతము బోధించుకొనుచున్నారు. అద్వైతపక్ష

చెప్పగూడదు అని కొందరందురు. ఆత్మబోధము వేరు, ఆత్మవద్బోధము వేరు. ఆత్మబోధము కాకున్న ఆత్మవద్బోధము కాదు. కావున ఆత్మను నిరూపించి ఆత్మవద్బోధము నుపదేశించుచున్నాడు. ఇదియే సంప్రదాయార్థము. కావుననే బ్రహ్మసూత్రములయందు ప్రారంభమున బ్రహ్మజిజ్ఞాసాఅని యున్నది. ఆత్మజిజ్ఞాసాఅని ఏల సూత్రింపలేదు ఆలోచింపుము. గీతలయందును 'జ్ఞానీత్వాత్మైవమేమతమ్' అని చెప్పియున్నాడు. అనగా ఆత్మవంతుడు భగవంతుడని యర్థము. కావుననే భగవత్సాక్షాత్కారము నకాత్మ సాధనభూతమై యున్నది అందుచేతనే యీ యుపనిషత్ ప్రారంభమున ఈశావాస్యమని యుపదేశింపబడియున్నది. అటులే గీతలయందు పురుషోత్తముడని వర్ణింపబడియుండెను. సః అను దానికి 'పరమాత్మ' అని అర్థమేల చెప్పరాదు అని యందురేమో! అట్లును చెప్పరాదు. పరమాత్మవంతుడే గాని పరమాత్మమాత్రము గాదు. అనుభూయమానమైన జీవాత్మలక్షణముల నెన్నింటిని నిరసించుకొన్నను కేవల భగవద్రూప మిదమిత్థమని సుభావగాహనము కాదు. గావున ప్రత్యేకముగ పురుషోత్తముడు అని గ్రహింపవలసి వచ్చెను. కావుననే వేదముల యందును "ఆయతనవంతుడు ఆత్మవంతుడు" ఇత్యాదిగ మతు బంత శబ్దము లుపయోగింపబడెను. వ్యవహారలోకమునందును ధర్మము లనియు గుణము లనియు శక్తు లనియు యీ మొదలగు సర్వ పారిభాషికజ్ఞానశక్తి ఆభగవంతునియందే యుండుటవలన సః అనగా ఆ పురుషోత్తముడే ఆ ఈశుడే అని చెప్పవలసివచ్చెను – అది పరమాత్మయు పరమాత్మవంతముగును అట్టివాడు సర్వవ్యాపకుడు అని సర్వవ్యాపకత్వము తనయందున్న యలౌకికశక్తి యని యుపనిష త్తుపదేశించుచున్నది. ఆత్మయొక్క వ్యాపకత్వము సమ్మతింపదగినదిగ గన్పట్టునుగాని పురుషునియొక్క సర్వవ్యాపకత్వము సమ్మతింపదగినదిగ కన్పట్టదు. కావుననే ప్రత్యేకముగ

పురుషోత్తముని సర్వవ్యాపకతా శక్తిమత్వము ఉపదేశించు చున్నది. దేవదత్తుడు సర్వవ్యాపకుడు అన్నప్పుడు నిజముగ ఏకకాలమునందు సర్వవ్యాపకత్వము దేవదత్తున కసంభవమెట్లగునో అట్లే పురుషోత్తమున కసంభవమేమో అని యనుకొనరా దని నిషేధించి ఉపదేశించు చున్నది. ఆ యుత్తమ పురుషుని సందర్శనము విధీయమాన మగుటబట్టి రెండవవాక్యము ప్రారంభింపబడుచున్నది. శుక్రమును, అకాయమును, అవ్రణమును, అస్నావిరమును, శుద్ధమును, అపాపవిద్ధమును అగును అనివాక్యము. ఇందలి శుక్రాదిశబ్దములు విశేషణములై విశేష్యమగు దానిని దేనినో పరామర్శించుచున్నట్లు బోధమగుచున్నది. ఆ విశేష్యము పూర్వవాక్యమునందలి 'సః' అను శబ్దమే అని యందురు కాని యాలోచింప నట్టిదికాదని తోచుచున్నది. ఈ విశేషణములలో 'అకాయము, అవ్రణము, అస్నావిరము' అనెడు శబ్దములు దేహమును పరామర్శించి పరిహరించు చున్నట్లున్నవి. మరియును పూర్వోత్తర వాక్యములు విశేషణ విశేష్యములుగ గ్రహింతమన్న లింగవ్యత్యాసము గలదని వ్యాఖ్యాత లందరొప్పుకొనిరి. ఆ వ్యత్యాసము ఛాందసమని సమాధానపరచుకొనిరి. గతిలేనప్పు డా సమాధానమే స్వీకరింపదగును. కాని వేరొకదారి కానవచ్చునప్పుడు ఛాందసత్వసమాధానము స్వీకరింప నక్కరలేదు. ఈ యుపనిషత్తునందే వేరొకచో తత్తేరూపం కల్యాణతమం అని వర్ణింపబడియున్నది. ఆ కల్యాణతమరూప నిరూపణమే యీవాక్యమున కుద్దేశము. అట్లగునప్పుడు చక్కగ నన్వయింపవచ్చును. అది శుక్రము అనగా కోటిసూర్య సమప్రభమై యుండునది. ఉపాసకుల యనుభవమునందును ధ్యానయోగాస్థితుడై ప్రారంభమున ఆ దివ్యతేజమునే దర్శించుట గలదు. ఆ దివ్యతేజోఘనరూపమే నీలలోహితమై సుందరమై యుండును. ఈ రూపమేల ప్రసక్తమయ్యెనని యందురేని వినుడు: ధ్యానముచేయునప్పుడు దర్శనయోగ్యత కలదా? అనెడు

శంకను నివారింపవలయునుగదా! ఆత్మకును బ్రహ్మమునకును సాక్షాత్కార ముండదు. ఆత్మ సాక్షాత్కారము బ్రహ్మ సాక్షాత్కారము అని సమాసపదముల యోజనమే యుండును, సంయోజన ముండదు. కావుననే ఆ సమాసములు మధ్యమ పదలోపి సమాసములుగ మాత్రము గ్రహింపవలెను. ఆత్మసాక్షాత్కార మనగా ఆత్మరూప సాక్షాత్కారమని యర్థము. అట్లే బ్రహ్మసాక్షాత్కార మనునప్పుడును. కాబట్టి ధ్యాత యుండునెడల ధ్యానము విధీయమాన మగునెడల, ధ్యాతృ ధ్యాన ధ్యేయ సమైక్యమగు రూప మొకదానిని సోపనిషదమగు దానిని వేదపురుషు డుపదేశించుచున్నాడు. ఆ రూప మారంభమున ధ్యాతకు తేజోరూపమైయుండును. అనంతరము కాయరూపమైయుండును. ఇందలి కాయ శబ్దము సార్థకము. దేహము, శరీరము మున్నగు శబ్దముల వంటి శబ్దముకాదు. ప్రకాశనార్థక ధాతుజన్యమైన కాయశబ్దము సార్థకము. అయినను ఆకాయము బంధము కానిదగుటబట్టి అకాయమని నిషేధించుచున్నాడు. అట్టినిషేధమే కాకున్న అకాయ మనుటవలననే అవ్రణాస్నావిరాదులు చెప్పబడినవియైయుండ మరల అవ్రణాస్నావిరాదుల నుపయోగింపనేల. కాయమును చెప్పి కాయగత ప్రాకృత లక్షణములను నిరసించి అప్రాకృతకాయ స్వరూపమును నిరూపించుచున్నాడు. అప్పుడే అవ్రణాది విశేషణములు శక్తిమంతము లగును. కావున అకాయమనగా కాయవంతమై అకాయమగునని యర్థము చెప్పితీరవలయును. కాయవంత మనగా తత్కాల దర్శనీయ తేజోమయ కాయవంతమనియు అకాయమనగా కాయదర్శన సంజాతోపాధిక వాసనారహిత మనియు అర్థమును చెప్పుకొనవలయును. అట్లు చెప్పుకొనకున్న ధ్యేయములేనిదగును. ధ్యేయములేనిదైన ధ్యానము లేనిదగును. జ్ఞేయమునకు జ్ఞానమెట్లుముఖ్యమో ధ్యేయమునకు ధ్యాన మట్లుముఖ్యము. జ్ఞేయమే ధ్యేయము, ధ్యేయమే జ్ఞేయము. ఈ ధేయ

రూపప్రశంస ఉపనిషత్తున కుద్దేశమే కానియెడల రూపవర్ణన మప్రసక్త మైయుండును. గీతలయందును "తత్త్వేన ద్రష్టుం జ్ఞాతుంప్రవేష్టుం" అని యుండుటంబట్టి రూపదర్శనమొక సాధనాంగమని నిర్ణయింపవలయును 'అవ్రణ' మను రెండవవిశేషణముచే ధ్యానకాలదృష్టకాయము వ్రణాది రోగాస్పదము కానిదనియు ప్రాకృతదేహములయట్లు స్థూలసూక్ష్మ కారణవాసనాక్రమ బంధనములేనిదనియు బోధమగుచున్నది. ఈ వ్రణ శబ్దమువలన కాయబహిర్లక్షణములు గ్రహింపబడును. అట్లే కాయాంత ర్లక్షణములుగూడ సమన్వయించుటకు 'అస్నావిరం' అను విశేషణ ముపయోగించెను. స్నాయువు నరములు కండరములు జీర్ణకోశాదులు సంయోగసంబంధవాసనలు గలిగెడు ప్రాకృతదేహమువంటిది కాదని నిరూపించుటకై 'అస్నావిర' మని యుపయోగించెను. 'శుద్ధమ్' అని ప్రత్యేకముగ పుణ్యమయత్వమును చెప్పుచున్నాడు. ధ్యాన కాలదృష్ట మైన కాయవత్త్వము "భస్మాంతమిదగ్ంశరీరం" అనునట్లు భస్మపర్యవ సాయిగాక ధ్యానకాలావగాహియై ఆకాయము అంతర్ధానాంతమై యుండును. కావుననే జాత్యాయుర్భోగ లక్షణానుభవమునకై యేర్ప డిన దేహమువంటి దేహముకాదని తెలుపుటకు శుద్ధమని విశేషణ ముపయోగించెను. ప్రాకృతదేహములు శుద్ధములుగ నుండనేరవు. ఈ శుద్ధశబ్దమునకు స్వచ్ఛమనియు, మచ్చమసిలేక యున్నదనియు ననెడు సాధారణార్థము గ్రహింతురేమోయని 'అపాపవిద్ధమ్' అను వేరొక విశేషణముపయోగించెను. ప్రారబ్ధభోగమునకై స్వీకరింపబడిన కర్మదేహములవంటి దేహముకాదని పాపసంపర్కలేశమును లేదని వైదికబుద్ధితో నిర్ణయించుచున్నాడు. భగవంతునియొక్క సాకారత సర్వవ్యాపకతాశక్తికి లోపము రానీయదని అట్టి పాపములేదని అపాప విద్ధ మనుచున్నాడు. పురాణములయందును ఆకారాపన్నతే వర్ణింప బడియుండుట విజ్ఞు లెరుంగుదురు. శరీరియే యగుచో పాపయుక్తుడగు

ననియు సావయవము సాకారము సర్వవ్యాపక శక్తిమంతము కానేర దనియు లౌకిక తర్కము నుపయోగింపరాదు. ఇట్టి విషయములయందే "నతర్కేణ మతిరాపనేయా" అనియును 'తర్కమప్రతిష్ఠ' మనియును 'నాయమాత్మా ప్రవచనేనలభ్యః' అనియును శాస్త్రములు ఘోషించు చున్నవి. గీతలయందును 'భగవద్రూపము చూడబడినట్లు వర్ణింపబడి యున్నది. ఈ మంత్రము కేవలోపాసకుల నుద్దే శించి చెప్పబడినది గాని వాగ్వైఖరీ విలాస పండితుల నుద్దేశించి చెప్పబడలేదు. ఈ రూపము ఈ తత్త్వము వాచోవిధేయము గాక తపోవిధేయమై యున్నది. తపోవిధేయ విషయములు తర్కదూర ములు. అట్టివానికి వేదమే ప్రమాణము. ధ్యానధ్యేయముల నాధార ముగా గొని వాపదూకులు కొందరు ధ్యానకాలమునందు ధ్యేయమై కన్పట్టినది మనోవికారమనియు, మనోదౌర్బల్యమనియు ఎవ్వ రెట్లు చెప్పుదురో అట్లు కానవచ్చునని యు, వాదింతురు. ఆ వాదముల కిందు తావులేదు. ధ్యేయమగునదియు జ్ఞేయమగునదియు, ఒకటియున్న దనుచో అది ధ్యానగమ్యమై తీరవలయును. మరచినవస్తువు జ్ఞాపకమునకువచ్చి ఎట్లావస్తురూపము సమన్వయమగునో అట్లే ధ్యేయముకూడ సమన్వయ మగును. ఒకగురువు ధ్యేయాకారము నక్కవలె యుండునని బోధించె ననుకొనుడు. అట్లు అవివేకియై అల్పజ్ఞుడై నక్కనేధ్యానించిన నక్క ప్రత్య క్షమై ధ్యేయమై ధ్యేయదర్శనానంతర దివ్యశక్తి కలవాడగుట సంభవింప నేరదు. యుక్తికొరకే యుదాహరణము తీసికొన్నను ధ్యేయము నక్క వంటిదని చెప్పుటకాధారములేదు. చెప్పినను నెగ్గదు. ఇంతయేల పురాణ ములయందొకచో నేతివేదాంత నిర్ణయంబులో ననిర్దిష్టముగ మనఃకల్ప నమునకు దూరముగ నిరాకారముగ నిర్ణయించుకొన్న ఆ గజేంద్రునికి ధ్యేయ మేరూపమున సంభవించెనో కారణమేమో తార్కికు లూహిం పుడు. ఇష్టమువచ్చిన ట్లుపదేశించిన ధ్యేయము కానేరదు. "ఆత్మ

వా అరే ద్రష్టవ్యః" అని ఆత్మదర్శనరూపము వర్ణింపబడెను. జంబుకాది దర్శనరూపము వర్ణింపబడలేదు. మరియును ఇక్కారణముననే కాళీ బాలా బగళా తారా ప్రభృత్యుపాసనములు నిషిద్ధములని చెప్పుకొనవలసి వచ్చును. ఆ ఆత్మయెట్టిదని శంకించువారికి 'తత్త్వమసి' అను వాక్యముపదేశింపబడెను. దర్శనయోగ్యమైన ఆయాత్మరూప మిం దుపనిబద్ధమయ్యెను. ఆరూపమే ధ్యేయము. ఖండాంతరములయందును యీయేకరూపమే ధ్యేయమైనట్లు ప్రమాణము లభించుచున్నది. క్రైస్తవులు మహమ్మదీయులు మున్నగువారు ధ్యేయరూపముగా 'యేసు' ని 'మహమ్మదు' ని స్వీకరింపలేదు. ఆరూపము వారికి ధ్యేయముగాక మననమాత్రమై యుండును. అయినను 'పాల్' అను ఒక మహాభక్తుడు ధ్యేయాకారమును గురించి యొకప్పుడు ధ్యానమునం దుండెను. అట్లుండనుండ మన వేదముల యందును పురాణములయందును ధ్యేయమని చెప్పబడిన ఆయాకారమే తనకు ధ్యేయమయ్యెను. ఈ ధ్యేయాకార మెవ్వ డుపదేశింపలేదు. తా ననుకొనన్నైనలేదు. గజేంద్రుడు గూడ యట్లే విష్ణ్వాకారమును ధ్యానింపలేదు. తా ననుకొనలేదు. అయినను ధ్యేయ మొక్కరూపయ్యెను. పురాణములమాట యటుండనిచ్చి మొన్నటి మన శ్రీ రామకృష్ణ పరమహంసలవారు కేవల కాళీసమారాధకు లయ్యు పరమార్థముగ భగవద్దివ్య శ్రీ వాసుదేవ సుందర నీలాకార సందర్శన భాగ్యవంతులైనట్లు విజ్ఞు లెరుంగుదురుకదా. మరియును ఎవ్వరికి నెరుకపడని ఒకానొక వస్తువును తెలిసికొనుటకు అంజనాది సాహాయ్యమున తద్వస్తువులను సందర్శించుటయు గలదు కావున నోరికొలంది తర్కింపక న్యాయ్యమైనదాని నుపదేశించిననే ధ్యేయమగును కాని ఇతరము కాదు. తర్కబద్ధము హేయము. ధ్యానసిద్ధము ధ్యేయము. ఈమంత్రములో తరువాతివాక్యము వింతగనున్నది. చూడుము. కవియు, మనీషియు, పరిభూరూపుడును స్వయంభువును అగువాడు అనియున్నది

ఇందలి శబ్దములెల్ల పుల్లింగముసందే గలవు. ఇవియన్నియు విశేషణ
ములే. ఈ విశేషణములకు విశేష్యమగునది పూర్వవాక్యమునందలి 'సః'
అనునదియే అయి తీరవలయును; వ్యాఖ్యాత లందరొప్పుకొనిరి.
ఈ విశేషణములవలన చైతన్య లక్షణములెల్ల ఈశ ప్రతిష్ఠితము లని
నిరూపించుచున్నాడు. మొట్టమొదటి వాక్యమునందలి 'సః పర్యగాత్'
అను వాక్యమును విని శిష్యుడు భ్రాంతుడు కావచ్చును. ఆకాశ మెట్లు
సర్వవ్యాపకమో భగవంతు డట్లు సర్వవ్యాపకుడని అనుకొనవచ్చును.
అట్లనుకొనుటతప్పు. ఆకాశమునకుగల సర్వవ్యాపకత్వము నిర్బంధము
వ్యాపించి తీరవలయును. అదియొక భూతము. అట్టిభూతములకెల్ల అధ్యక్షు
డైన భగవంతుని సర్వవ్యాపకత్వ మట్టిదికాదు. కావుననే వేరొకచో
"తదేజతితన్నైజతి" అని విరుద్ధధర్మములను ప్రతిపాదించెను. సర్వవ్యాప
కత్వము మాత్రముగాక విశేషలక్షణములను వర్ణించుచున్నాడు. 'కవిః'
అని భగవంతుడు కవి వాచ్యుడుగ నిర్దేశింపబడెను. సాధారణ కవులను
మన మెరుంగుదుము. అసాధారణ కవి యితండని బోధించుటకు కవి
యను విశేషణము నుపయోగించెను. దీనినే క్రాంతదర్శిత్వ మందురు.
ఆంధ్రదేశములో గిరీశ మన్నను వెంకటేశ మన్నను పేరిగా డన్నను
జంఘాలశాస్త్రి యన్నను చారిత్రక పురుషులేమో అనెడు విభ్రాంతిని
కల్పించు నంతటి విఖ్యాత కవు లుండిరి. ఈ గిరీశము చారిత్రక
పురుషుడు కాడుగాని భగవత్కవి నిర్దిష్టుడు చారిత్రక పురుషుడై
మహోద్దండుడై యుండగలడు. అనగా భాగవతమైన దివ్యభావనము
సామాన్యమైన ఊహామాత్రముకాదని యెరుంగదగును. రెండవదియగు
మనీషి శబ్దము బుద్ధిమంతుడని యర్థమిచ్చునది యగును. మనీషి విశేష
ణము వలన బ్రహ్మార్పణబుద్ధితో సుస్థిరముగ మన ముండిన జాలును.
ఆ భగవంతుడు మనీషి. కావున ఏరూపంబున మన యూనికి యోగ
క్షేమవంత మగునో ఆ రూపంబు నెరిగి తానట్లు నిర్వహించు ననెడి

నిర్ణయ ముపాసకులకు కలుగవలయును. గీతలయందును "యోగ
క్షేమం వహామ్యహం' అనియును, 'మోక్షయిష్యామి మాశుచః' అని
యును, అభయహస్త మీయబడియున్నది. అట్లే మనీషిశబ్దము ప్రయో
గింపబడియున్నది. ఇందొక విశేషముగలదు. కవి అయ్యు కవికి మించిన
వాడెట్లగునో మనీషియయ్యు మనీషికి మించినవాడగుచున్నాడు.
కావుననే అనంతరమున రెండు విశేషణములు గాను 'పరిభూః'
'స్వయంభూః' అని భగవంతుడు సాక్షాత్కరించి కాపాడవలెనని అన
నక్కరలేదు భగవదనుగ్రహము సంపాదించుటకు కావలసిన జ్ఞానధ్యానా
దులును ధర్మనిర్వహణాదులును బుద్ధియోగావలంబనమును గావించు
కొనుచునున్న జాలును. ఆభగవంతుడు అగోచరుడయ్యు గోచరప్రాయు
డగును. ఈదేశము ఆదేశము, ఈకాలము ఆకాలము, ఈవయసు
ఆవయసు అని యనుకొనకుము, ఎందైనను ఎప్పుడైనను ఏరూపమున
నైనను ప్రత్యక్షముననో పరోక్షముననో ఓఉపాసకా! నిన్ను గాపాడక
మానడు. అనెడు నిబ్బరము శిష్యునకు కలుగవలయునని రెండు విశేష
ణములను వాడెను. పరిభూః అనగా సర్వభూతరూపుడు, స్వయంభూః
అనగా స్వయంభూతరూపుడు. నీతివిహీనులైన రక్కసుల నడుమ
సర్వార్పితచిత్తవృత్తితో పరితపించుచున్న సీతాదేవికి ఆరక్షోలోకమున
రాక్షసుడేయయ్యు రామచరణైక శరణుడైన విభీషణుడు సీతాబంధ
మోక్షకారణు డయ్యెను. మహాభయంకర సముద్రాంతర్భాగమునం
దుండవలసివచ్చినను, కాపాడదలంచెనా! భగవంతుడాసముద్రమున
పెద్ద కెరటము రూపమై నిన్నొడ్డును బడవైచును. లౌకికజ్ఞానముచే
నీవేమేమో యనుకొందువు కాని అది భగవత్కార్యము. కావుననే
భగవంతుడు ధ్యానమునందు గోచరుడైనను కానున్నను గోచరప్రాయు
డని నిబ్బరముతో ధ్యానజ్ఞానాదు లవలంబించుకొనుము. ఫలము
సిద్ధము నిస్సందిగ్ధము. ఇక లోకమునందలి కొల్ల సంఘటనములును

భగవదధీనము లని భగవంతునియొక్క జ్ఞానేచ్ఛాక్రియాశక్తి రూపము లను వర్ణించుచున్నాడు. ఈజగచ్చక్రమును ఈజగద్ధర్మ నిర్వాహణమును భగవదధీనమైయున్నది. యాథాతథ్యముగ సకలార్థములను సర్వకాలములయందు సంధానించుచున్నవా డతడే యని కడపటివాక్యము. ఈవాక్యము మొదటిమంత్రములోని మొదటివాక్యమునకు సార్థక్యమును చెప్పుచున్నది. అత డీశుడు, పాలకుడు అగుటచే సకలార్థములను యతడే యనుసంధించును. ఎల్లదియు నతనిదే. నీవు నీప్రత్యేకత్వము నీయహంవృత్తిత్వము సర్వము తదధీనము కావున తదగ్నితుడవై యుండుము అని యుపదేశించెను.

# ౯. మంత్రము

అంధంతమః ప్రవిశంతియేఽవిద్యాముపాసతే
తతోభూయ ఇవతే యఉ విద్యాయాంరతాః॥

తా॥ ఈమంత్రమునందు విద్య అవిద్య అను రెండువిషయములను సమన్వయము చేయుచున్నాడు. దీనినిబట్టియే పూర్వమంత్రములలో నేదియో యొకవిద్య ప్రసక్తమైయుండెనని సంగతి సందర్భములంబట్టి యూహించి తీరవలయును. అవిద్య, దహరవిద్యయో, అక్షిపురుష విద్యయో మరియేపురుషవిద్యయో అయి యుండవలయునుగదా! అట్లగుటంబట్టి బుద్ధియోగమునకు సంబంధించిన ఉపాసనావిద్య నుద్దేశించి అకారాది శబ్దములకు చెప్పబడిన వ్యాఖ్యానము న్యాయ్యమై యుండును. ఎవ్వరు అవిద్యయే (అసత్తే) ఉపాసనాయోగ్యమని తలంతురో వారు గాఢాంధతమస లోకంబులం బ్రవేశింతురని శాపపూర్వక

ముగ చెప్పుచున్నాడు. అవిద్యను కాలదన్ని విద్యయే ఉపాసనా యోగ్యమని అనెడువారు పూర్వోక్తమైన అంధతమస్సులోకములకంటె అంధతర అంధతమ మహాతామసలోకముల బ్రవేశింతురని కఠినముగ స్పష్టముగ చెప్పుచున్నాడు. ఇందుపయోగింపబడిన అవిద్యయను శబ్దమున నకు మోక్షేతరసంబంధమని చెప్పవలయును. అమృతత్వప్రాపక ... కాని దెల్ల అవిద్యావాచ్యమే. వైజ్ఞానిక నిర్ణయములు తర్కసిద్ధాంతములు కార్యకారణ కల్పనావైదగ్ధ్యములున్నగు మహాపాండిత్యమెల్ల అవిద్యా వాచ్యమే. అట్లవిద్యావాచ్యమని దానిని త్యజింపరాదు. దానినుపాసింప దగును కాని ఆయవిద్యాస్వరూపమును విద్యయందు లయముగావింప వలయును. విద్యావిద్యలసామరస్యము ఈమంత్రమునకు ప్రధానము. అవిద్యామాత్ర సమాశ్రయణమువలన క్షేమము సంభవింపదు. ఋణ మైన గావించి ఘృతమును త్రాగవలయు ననెడు కేవల శరీరభోగ సాధనామాత్రపరమైనవానినే సాధించుట యవిద్యోపాసన మనబడును. ఇక విద్య యనగా అమృతత్వప్రాపక మగునది. అట్లని అవిద్యా తిరస్కార పూర్వకముగ విద్యాపురస్కార మగునెడల నదియును నాశహేతువే. సాధారణముగ నిదియంతయు నేల 'బ్రహ్మవిద్యయే విద్య జ్ఞానమువలననే కైవల్యము మిగిలినదంతయు అజ్ఞానమే. మనకేల యీగొడవ.' అని కొందరనుకొందురు. అదితప్పు. అట్టియర్థముతోడనే "జ్ఞానాదేవతు కైవల్యం" అను వాక్యముగలదు. ఆవాక్యములోని 'తు' శబ్దమువలన అవిద్యయు గ్రహింపబడుచున్నది. మరియును గీతల యందును "వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః" అని ప్రత్యేకముగ విద్యాకైవల్యవాదుల నుద్దేశించి చెప్పియున్నాడు. ఇంతకును విద్యయు అవిద్యయు పుష్పము వాసన ఉండినయట్లు సమనిత్యమై యుండును. తార్కికులుకొందరు విద్యకు అవిద్యాంతత్వము అత్యంతవిరోధము కావున, ఒకవస్తువున కొకస్వభావము స్వధర్మమై యుండును

గావున విద్యకు అవిద్యతోడి సంబంధమును అవిద్యకు విద్యతోడి సంబంధమును నుండ నేరదని నిర్ణయింతురు. వెలుగుతో చీకటికిని చీకటితో వెలుగునకును సంబంధ ముండనియట్లు తేజస్తిమిరములవంటి యీ విద్యావిద్యల సంబంధము గగన కుసుమాఘ్రాణ మనియందురు. కాను తార్కికులకట్లే! భావుకులకు మాత్రము గగన కుసుమముగూడ ఘ్రాణ యోగ్యమగునది యగును. పరిమళభర సుందర తరులతా గుల్మవిస్తార భూమికి జననిజలమై తజ్జలమున కగ్నియై తదగ్నికి వాయువై తద్వాయువున కాకాశమై యుండుట నిక్కమే యగునేని భూగత మల్లీ కుసుమాఘ్రాణము గగనమందును సూక్ష్మాతి సూక్ష్మ రూపమున ఆగగన కుసుమాఘ్రాణము సంభవమై యుండును. వైజ్ఞానికులుగూడ గగనమునుండి సకలపదార్థములను గ్రహింపవచ్చుననెడి నిర్ణయమునకు వచ్చియున్నారు. ఇక తర్కవదజాలేంద్రజాల ప్రవృత్తి విడిచి తేజస్తిమిరములవంటివే యైనను విద్యావిద్యల ఏకీకరణము ముఖ్యమని వేదపురుషుడు చెప్పుచున్నాడు కావున నమ్మితీరవలయును. ఇంతకును ఉపాస్యమగునది కేనోపనిషదాదులయందు నిషిద్ధమైయున్నది కావున ఉపాసనానిషేధమే యీమంత్రమునందు చెప్పబడుచున్నదని యనుకొనుట యొకపెద్ద పొరపాటు. ఆ కేనోపనిషత్తునందలి 'నేదం యదిదముపాసతే' అనువాక్యము ఉపాసనానిషేధమునకై పుట్టలేదు. బ్రహ్మము సర్వాతిశాయియనియు, మనస్సునకు మనస్సనియు, నిక్లైసర్వమునకు వర్యమనియు స్పష్టపరచుట కవలంబించినధోరణికాని ఉపాసనానిషేధము కాదు. కావుననే "అన్యదేవతత్ విదితాత్" అథో అవిదితాత్ అధి ఇతిశుశ్రుమ పూర్వేషాంయేనస్తద్వ్యాచచక్షిరే." అనియుపక్రమింపబడినవాక్యమే అర్థాన్తరముల చెప్పబడెను. అపరబ్రహ్మతత్త్వము ఎరుగబడినదానికంటెను, ఎరుగబడదను దానికంటెను మించియున్నదని చెప్పుచున్నది. ఇక ఉపాసనానిషేధముగాదు. ఈయుపనిషత్తులోని 'యాథా

తద్యతోఽర్థాన్ వ్యదధాత్ ' అనువాక్యమువలన పురుషార్థములయందు రెండుభగవత్పరి రక్షితములై మిగిలినరెండుఉపాసక కోపాశ్రితములై యుండదగునని చెప్పిన యీ ద్విత్వవిధానమే విద్యావిద్యల విలసనమని ఎఱుంగవలయును. ధర్మార్థములు తదధీనములనియు, కామమోక్షములు త్వదధీనములనియు గురుశిష్యసంవాదమున చెప్పబడెను. కావుననే ధర్మాదిగ్లానిసంభవించునా డవతరింపవలసివచ్చును. ధర్మార్థవ్యవస్థాపనము భగవదధీనము. ఇక కామమోక్షములు రెండును బుద్ధియోగసంపన్నుడై భగవదధీనము గావింపవలయును అని యుపదేశించు చున్నాడు. గీతలయందు 'మోక్షయిష్యామి మాశుచః' అనువాక్యమున కిదియే తాత్పర్యము. ఈచర్చవలన విద్యయు అవిద్యయు అంధతమసలోకముల నొందించునవియే యగుటవలన రెండును త్యాజ్యములా, యనెడుమూలచ్ఛేదకశంక పుట్టనక్కరలేదు. అట్టిది వేదాభిప్రాయముగాదు. గీతలయందును "వేదైశ్చసర్వైరహమేవ వేద్యః"అని వేద్యత్వమువర్ణింపబడినది. వేద్యత్వము విద్యకుగలదుగాని అవిద్య కుండదు. దీనిని సమన్వయించుటకే కొందరు ఇందలి విద్యాశబ్దమునకు ఉపాసనాదికమనియు, అవిద్యాశబ్దమునకు కేవల ప్రపంచాశక్తియనియు వ్యాఖ్యానించిరి. ఏవిద్యాశబ్దమీమంత్రమం దుపయోగింపబడెనో ఆ విద్యాశబ్దముచేతనే "విద్యయా అమృతమశ్నుతే"అని స్పష్టముగ అమృతత్వప్రాపకమగునది విద్య యని చెప్పెను. కావున మృతిప్రాపక మవిద్య. అమృతప్రాపకము విద్య అని చెప్పుకొనవలయును. మృతిని మృతిగనే విడిచెడు కార్యము తుచ్ఛకార్యము. మృతిని అమృతమునందు మేళవింప జేయవలయును. అనగా మృతి అమృతముగ పరిణమింపవలయును. అప్పుడు సర్వము విద్యారూపమగును. వేదమయమగును. అనేకపదార్థములు చెడి నశించుకొనుడు. మృత్యువులనుండి నశించుకొనుడు. ఆ మృతపదార్థములు అభ్యుదయ రూపామృతములకు సహాయకారులుగ వినియోగింప బడవలయును. సస్యాదులయొక్క అభివృద్ధికి

మృతపస్థానములు సహాయకారులు. వానినే ఎరుపనియు నల్లుపనియు నందురు. శుష్కములగు జలములు పుష్కలములగు మేఘములకు కారణము. ఇట్లే నాశ ప్రకాశ ధర్మచక్ర భ్రమణము ఈ సృష్టి రహస్య మని తెలిసికొనవలయును. వైజ్ఞానికులు గూడ అనేక మృత పదార్థముల యందు వ్యాపించిన తేజః ప్రసరణము కొన్ని కొన్ని పదార్థములుగ మారుచున్నదని చెప్పుచున్నారు. Hydrogen is formed by the contact of the radiatian with the dead bodies అని వైజ్ఞానిక నిర్ణయము. ద్వైతమా అద్వైతమా యని, 'కన్నుజోడి' యని గివ్వల నాట రవ్వలలోపడక తత్త్వావగాహనము గావించుకొనుట శ్రేయము. భగవంతుడొక్కడే. తత్త్వమద్వైతమే. అద్వైతముకాదని ప్రపంచమున ఏనిశిత మతమును నిర్ణయించియుండలేదు. కావున ప్రపంచ మెల్ల అద్వైతముకాని అద్వైతమునకున్నంత యస్తిత్వము ద్వైతమున కుండునా ఉండదా అనునదియే సందేహము. ద్వైతముయొక్క అనాదిత్వము అంద రంగీకరించినదియే. ద్వైతమనంతము కాదని యద్వైత వాదము అదిసత్యమే. ద్వైతమున కనంతత్త్వము సిద్ధించుచో మోక్షము నసంభవమే. మోక్షమనుటయే ద్వైతముయొక్క సాంతత్త్వము. ఇదియే అమృతీకరణము. ఈ సృష్టిరహస్యమంతయు నిండమిడియున్నది. మోక్ష విద్య 'అహంబ్రహ్మాస్మి' 'సోఽహమస్మి' అని నిత్య మనుసంధానించుటయే యనియందురు. ఆవన్మాత్రము బహ్మవిద్య కాదు. పై వాక్యములను అయిదు ప్రకారములుగ జపించినంగాని మోక్షము కలుగదని పూర్వ సూత్రకర్తలే నిరూపించియున్నారు. ఆపంచప్రకారవిద్యయే విద్యావిద్యల సమ్మేళనము. గీతలయందు "కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః క్షిప్రంహిమానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా" అని కర్మజసిద్ధిని నిరాకరించుచున్నాడు కావున బ్రహ్మవిద్యకు ముఖ్యమగు విషయము ఫలకామనా నివృత్తి కర్మకరణప్రవృత్తి. యీనివృత్తి ప్రవృత్తులసంపత్తి

సముదాయముగా జ్ఞానమనియుందురు. దీనినే గీతాపరిభాషలో బుద్ధి యోగమని చెప్పవచ్చును. ఈమంత్రాభిప్రాయము ననుసరించుచు సందేహనివారణార్థము వేరొక మంత్రము నుపదేశించుచున్నాడు.

## ౧౦. మంత్రము

అన్యదేవాహు ర్విద్యయా అన్యదేవాహు రవిద్యయా
ఇతిశుశ్రుమ ధీరాణాం యేనస్తద్వ్యాచచక్షిరే

తా॥ ఈమంత్రమునందు అప్పటికుండిన గురుపరంపరా సంప్ర దాయము ననువదించుచున్నాడు. విద్యచేతను వేరుఫలమే అవిద్యచేతను వేరుఫలమే అగును, అని చెప్పుచున్నారు. అవిద్యచేత మూఢలోకము లును విద్యచేత మోక్షమును కలుగుచున్నదని వ్యాఖ్యానించుకొనరాదు, అదితప్పు. ఈమంత్రములోని అన్యత్ శబ్దమునకు అమృతాదన్యత్ = అమృతముకంటె వేరగునది యని యర్థముచెప్పుకొనవలయును. సకలోప నిషత్తులకును అమృతత్వప్రాప్తినిరూపణమే ప్రధానము గావున నుపనిషత్తుల యందు ప్రయోగింపబడిన అన్యశబ్దమునకు ఉపనిషత్ప్రతిపాదితబోధా ర్థాన్యమని యర్థము. అట్లుచెప్పుకొనకున్న ౯—౧౧మంత్రములు నమన్వి తములు కానేరవు. కాకాక్షిన్యాయమున దేహళీదీపన్యాయమున యీపదియవ మంత్ర ముపదేశింపబడెను. ఈ మంత్రము పూర్వోక్త మంత్రార్థప్రకాశకము. కావుననే అన్యశబ్ద ప్రయోగమువలన, కేవల విద్యవలన, కేవలా విద్యవలన మోక్షములేదని ఈశావాస్యము నుగ్రహ ముకాదని చెప్పుచున్నాడు. కేనోపనిషత్తునందు చెప్పబడిన "విదితాత్ అవిదితాత్" అనుశబ్దములయర్థమే యిందుపనిబద్ధమయ్యెను. ఈమంత్రము నందు "ధీరాణాం" అనుపదమునుబట్టి గురుశిష్యన్యాయము యెంత ప్రాచీన

తమవో విజ్ఞులూహించుకొనుడు. కావుననే బ్రహ్మవిద్య గ్రంథావలో కనజాతముకాదు. గురుపరంపరానంభూతము. అని "ఇతిశుశ్రుమ ధీరాణాం" అనువాక్యము బోధించుచున్నది.

## ౧౧. మంత్రము

విద్యాంచా విద్యాంచ యస్త ద్వేదోభ యగ్ం సహ।
అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే॥

తా॥ ఈ మంత్రమునందు విద్యావిద్యలు సహానిందాన్యాయమున సమన్వయించి చెప్పుచున్నాడు. విద్య ఎట్లు ప్రశస్తమో అవిద్యయునట్లే ప్రశస్తము కాని యీ రెండింటిని ప్రత్యేకముగ రెండుగనే చూచినచో నింద్యములనియు ఒక్కటిగనే చూచినచో ప్రశస్తమనియు సమన్వయించుచున్నాడు. గీతలయందును "ఏకంసాఖ్యంచ యోగంచ యఃపశ్యతి" అనెడు వాక్యము దీనిననుసరించుచున్నది. విద్యయును అవిద్యయును సహచరితముగ తెలిసికొనవలయునని విధించుచున్నాడు. ఈ సాహచర్యము, సముచ్చయము వంటిదిగాదు. రామసహచరుడై లక్ష్మణుడడవికిపోయెను. అనగా లక్ష్మణుని యరణ్యగమన నిర్గమనములు రామాయత్తములుగాని లక్ష్మణా యత్తములుగావు. ఏకాధిష్ఠానమగు నప్పుడే సాహచర్యము సంభవము. కావుననే ఏకవిజ్ఞానమున సర్వవిజ్ఞానము సంభవమగుచున్నది. ఇదియిట్లుండ కొందరు ఋషిదేవతా ఛందస్సులను చక్కగనెరుగుట విద్యయనియుతత్ప్రకారమాచరించు కర్మకలాప మవిద్యయనియు, ఈ రెండింటి జోడింపువలన చిత్తశుద్ధికలుగుననియు చిత్తశుద్ధి మోక్షకారణమనియు మోక్షమునకు విద్యావిద్యోభయ సహాపేక్ష

నము పరంపరా సాధనమని చెప్పుచున్నారు. అట్టి ప్రసక్తి యీ మంత్ర
ములయందెందును గానరాదు. మరియు ననేక స్థానములయందు విద్యయా
కరోతి అని వేదములయందు చెప్పబడియున్నది. హిరణ్యగర్భోపాసనాది
విద్యలు యిందలివిద్యాశబ్దమున కర్థముగాదు. ఏది యమృత ప్రాపకమో
యది విద్య యని నిర్వచించి యున్నాడు. కౌపీనసంరక్షణార్థమీ పటా
టోపమన్నట్లు స్వసిద్ధాంత స్థాపనార్థము యీశబ్దాటోపమును విడుచుట
శ్రేయము. ఒకవేళ అవిద్యకు కర్మార్థమే చెప్పుకొన్నను భంగములేదు.
అవిద్యా శబ్దార్థమునందు మోక్షేతరము లన్నియు సంగ్రహింపబడి
యున్నవి. ఇంతయేల జగద్విద్యకు అవిద్యయనియు బ్రహ్మవిద్యకు విద్య
యనియు, యీ రెండింటి జోడింపు మోక్షమనియు సులువుగ ననుకొన
వచ్చును. ఈరెండింటియొక్క ఫలము తరువాత చెప్పుచున్నాడు. అవిద్యచే
మృత్యువును తరించి విద్యచే అమృతమును పొందుచున్నాడు. గీతల
యందును "యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం, తద్యోగైరపి" అని విద్యా
విద్యల తుల్యా యోగబలములను నిరూపించి యున్నాడు. అవిద్యచే
మృత్యువును తరించుట సంభవించును. అవిద్యచేత మృత్యువననేమి ?
ఆ మృత్యువు భయకారణమా ? లయకారణమా ? ప్రకృతిరూపమా ?
వికృతిరూపమా ? మున్నగు సందేహములన్నియు నివారింపబడుటకు
అవిద్యయే ముఖ్యసాధనము. సంశయాత్ముడు నశించును కావున సందే
హము నివారించుకొనుట కవిద్య నవలంబించి, అమృత సాక్షాత్కారము
నకు విద్య నవలంబింప వలయును. ఒకటి మృత్యుకారణము.
ఇంకొకటి యమృతకారణము. మృత్యుకారణమనగా, చావు లేక
శాశ్వతముగ యీదేహముతోనుండుటకాదు. మరణభయ నిరాకరణము
తత్కారణము. లోకమునందు కుండలయొక్క నిమిత్తోపాదాన కార
ణములను చక్కగ నెరింగిన కుమ్మరి ఘటాభావవిషయచింత లేనివాడై
యుండును. శతాధికఘటములు తనకడ లేకున్నను, శతాధిక ఘట

నిర్మాణదాక్ష్యము కర్మకౌశలము తనయం దుండుటచే నిర్లేపుడై పోయిగ
నుండగలడు. ఘటము ఘటాకారము ఘటోపహితాకాశము, ఘట
మూలద్రవ్యమగు మృత్తు. ఇదియంతయును అవిద్యారూపమే.
ఆమృత్తు స్వయముగ ఘటరూపమై పరిణమింపనేరదు కావున ఘటఘట
త్వాదులెల్ల నవిద్యయని చెప్పవలయును. కాని యీ యవిద్యాసమ్మేళ
నము లేకున్న ఘట స్వరూపమే లేకపోవును. అందుచేతనే లోకము
నందును వైజ్ఞానికులనిర్ణయము సంయోగ వియోగ విజ్ఞానముండినంగాని
సమగ్రజ్ఞానముగ భావింపరు. కావున విద్యావిద్యోభయ సాహచర్యము
సమగ్రజ్ఞానరూపము. దీనినే గీతలయందును బుద్ధియోగమని చెప్పి
యున్నాడు. బుద్ధియోగము బుద్ధిమాత్రపర్యవసాయియై బుద్ధికి పరమై
యుండిన బుద్ధిగమ్యముగనుండిన దానియందు ప్రవేశించుట అనునదియే
అమృతప్రాప్తి; నైష్ఠికమగు శాంతి, బ్రహ్మనిర్వాణము, అని చెప్పు
దురు. అది బుద్ధియోగపరమఫలము. అమృతమశ్నుతే అను వాక్యము
లోని అమృతపదము ఏతన్మంత్ర పూర్వము ప్రయోగింపబడలేదు.
కావున అమృతప్రాప్తి లక్షణమైన బుద్ధియోగమున కిది పరమ
మూలము. యీ విద్యావిద్యలనే వాక్యాంతరములచే చెప్పుచున్నాడు.

## ౧౨. మంత్రము

అంధంతమః ప్రవిశంతియేఽసంభూతిముపాసతే
తతోభూయఇవతే తమో యఉ సంభూత్యాంరతాః॥

తా॥ ఈమంత్రమునందు పూర్వ మంత్రధోరణినే యుపదేశించు
చున్నాడు. ఐనను పూర్వమంత్రముల యందున్న విద్యావిద్యల
స్థానమునందు సంభూత్యసంభూతులను ప్రయోగించియున్నాడు. సంభూతి

యున నేమి అసంభూతియన నేమి అని సందేహింప తన్నివార
ణార్థము "సంభూతించ వినాశంచ" అని వేరొకమంత్రమునందు సం
భూతివినాశశబ్దము లుపయోగించెను. వినాశము మృత్యుతారణకారణ
మనియు సంభూతి అమృతి ప్రాపణకారణమనియు చెప్పుటంబట్టి సంభూతి
యన విద్యయనియు, అసంభూతియన అవిద్యయనియు తెలిసికొనవల
యును. ఈమంత్రము మందాధికారుల నుద్దేశించి చెప్పబడెననియుందురు.
ఇంకను నెక్కుడ ప్రసంగించినచో వేదవేదాంగములెల్ల మూఢుల కుద్దే
శింపబడినవే యుండురు. చెప్పవలసినది, వినవలసినది, తెలిసికొనవలసినది
యేదియును లేదను మహానిర్ణయ వేత్తలకు మావ్యాఖ్యానముద్దేశింప
బడలేదు. తెలిసికొనదలచినవారికే యీవ్యాఖ్యానము. ఈమంత్రమునం
దుపయోగింపబడిన సంభూతి శబ్దము నులువుగ సంభవమనియు అసం
భూతిశబ్దము అసంభవమనియు వ్యాఖ్యానించుకొందము. ఈ సంభవా
సంభవముల ఏకత్వానుదర్శనమే పూర్వ మువదేశింపబడి యున్నది.
అట్లయినను యీ మంత్రాన్వయమును 'అరణ్యమియాత్' 'తతోన
పునరేయాత్' 'భిక్షాచర్యాంచరంతి' 'న్యాసఏవఅత్యరేచయత్'
అను శ్రుతులను తత్సజాతీయశ్రుతులను తీసికొని యీ మంత్రము
మందాధికారికొరకని వ్యాఖ్యానించిరి. ఆశ్రుతుల యర్థమును న్యాయముగ
మన మాలోచింతము. జీవితమునందుగాని మరణమునందుగాని
నీ వాశపెట్టుకొనకుము అను వాక్యము నీతివాక్యము. శాశ్వత
ముగ బ్రతుకవలయు ననికోరువాడు నానావిధ ఘోర కృత్యకార్య
ముల నాచరించుటలో విముఖుడు కానేరడు. శాశ్వత దేహధారిత్వ
మసంభవము. జీవితమే ప్రధానమని యనుకొనుటయేగాని జీవిత
ప్రాధాన్యము నీ యధీనమునలేదు. అనుకొని నీవాచరించు నది స్వపర
మారకమై స్వనాశకారణమగును. లోకమునందుగూడ స్వజీవిత నిర్వ
హణమాత్ర బుద్ధులగువారే పరోపద్రవకారకులై కొంతకాలము విజృం

భించినను సంపూర్ణముగ సహించువారగుదురు. హిరణ్యకశిపు రావణాదులట్టివారే. వర్తమానకాలమందును స్వసుఖవాదు లట్టివారే. అట్లే మరణమునందును కోరిక పెట్టుకొనరాదు. ఎవ్వడును మరణము కోరడు గాని ఒకప్పుడు కోరుటయును సంభవించును. స్వమరణమునే యభిలషించువాడు స్వమరణము తటస్థమైనను కాకున్నను పర మరణకారణముందు నింకనుగొంకులులేని స్వభావముగలవాడగుటచే అదియును దోషభూయిష్ఠమే. కావుననే నైతికులు ఆత్మహత్యా ప్రయత్నము కావించువారిని దండింతురు. అందుచే "జీవితేవా మరణేవా గృధింమాకురు" అని యాదేశవాక్యము పుట్టెను. దీనివలన జీవనమరణములు గృధి కధీనములు గావు. గృధియనగా దురాశ. ఇట్లుపదేశించుటవలన ఆశారహితుడగును. ఆచరణ సహితుడై ఆనంద మనుభవించును. గీతలయందును. అపరిహార్యమగు విషయమున దుఃఖింప నీవు తగవు. అని స్పష్టముగ చెప్పియున్నాడు. ఇక "అరణ్యమియాత్" అనుశ్రుతికి తాత్పర్య మెరుంగుదము. ఏస్థానమునుండి అరణ్యమును పొందవలయును ఆ అరణ్య మెట్టిదై యుండవలయును. కీకారణ్య బృహదారణ్యమా! కాక జానెడు మూరెడు మొక్కలతోనిండియుండిన యరణ్యమా? ఆయరణ్య స్వరూపము చక్కగ నిరూపింపబడక పోవుటవలన వేదమునం దుపయోగింపబడిన యరణ్య శబ్దమునకు లౌకికార్థము చెప్పగూడదేమోయని సందేహము కలుగును. పోనిండు. ఆ అరణ్యమునకు పోవుదము. ఏలపోవలయును అనుదానికి సమాధానమేమి? నగరాదు లీశావాస్యములు గావనియు అరణ్యమీశావాస్యమనియు నిశ్చయింతురా! కాదు. ఏకాంతవాసమునకు అని యందురా? అట్లయిన నిర్జనారణ్యమునకు పోవలయు నన్నమాట. ఏ యరణ్యమును నిర్జనమై యుండనేరదు. నిర్జనవాస గృహమై యుండినను నిర్జనమైయుండదు. అడవులకు జనులు పోవుట వచ్చుట సంభవమే. ఇక నిర్జనారణ్య మనుటయు పొసగదు. నిశ్శబ్దారణ్యమని

యుండుమా ? నిర్జనారణ్యము కావలయును. నిర్జనారణ్యగుహ సృష్టి లోనే లేదు. కావున అరణ్యమనగా ఒక గుహాయని అర్థము చెప్పి కొందురేమో అదియును పొసగనిదే. మీరాయర్థము చెప్పిన యెడల అరణ్యమనగా ఫలాహారశాలయని మేమర్థము చెప్పెదము. కావున యీ డిద్దడబిద్ద వాదము విడిచి ఉపనిషద్గమ్యమును, ఔపనిషదపురుషో పాసనాకారణమును ఆరణ్యక సంజ్ఞకమును నగు బ్రహ్మవిద్యా బోధమునకు సుముఖుడు కావలయునని యర్థము. కావున నే యుపనిషత్తుల కారణ్యకములని పేరువచ్చెను. అరణ్యములందు చెప్పబడినవి కావున యీ యుపనిషత్తు లారణ్యకములని నిర్వచించిరి. ఈ నిర్వచనము తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాదమువలెనున్నది. అట్లయినయెడల సనక సనందనాదులు, మరీచాద్యులు నారదాదులు విశ్వామిత్ర వశిష్ఠాదులు నరణ్యములయందున్నట్లు నిర్ణయింపవలసి వచ్చును. వారారణ్యకులును ఆటవికులును కానేరరు. తమతమ గురుకులములను (బ్రహ్మవిద్యా శాలలను) తత్తత్ప్రాంతములయందు స్థాపించినయట్లున్నది. ఆ ప్రదేశములకు తపోవనములని పేరు. తావన్మా త్రమున నవి యరణ్యములయిన్నచో మహానగరములు నరణ్యములే. నగరములన్నియు నించుమించు నరణ్యావృతములై యుండును. ప్రమదా వనము క్రీడావనము కృతకాద్రులు బృందావనము మున్నగునవి లేవా ? అవి యరణ్యములా ? కాన అరణ్యమనగా మహాతరుగుల్మలతా ఘోర క్రూరమృగ సంకుల భీకరారణ్యమని యర్థము కాదు. ప్రపంచ వాసనా నానా సంక్షోభ రూపమైన 'రణ్యము' (రాణువ) లేనిది యరణ్యము. అట్టిది మహానగరములయందున్నను, మహాభీకరారణ్యములయందున్నను గుహాలలో దాగినను బుద్ధియోగి యగుచో సంభవము. కాకుండిన కాదు. కావున అరణ్యగమన మనగా బుద్ధి గుహాప్రవేశ మని యర్థము. అట్టిదానినే గుహ్యవిద్య అని యందురు. దానిని పొందిన

వాడు భ్రష్టుడు కారాదని హెచ్చరిక చేయుచున్నాడు వేదపురుషుడు. అది యట్లుండనిండు. "భిక్షాచర్యంచరంతి" అను నొక వాక్యమును తీసికొని భిక్షుకుడు కావలయునని వ్యాఖ్యానించుచున్నారు. సత్యమును కొందము. జనకాదులు భిక్షుకులుగారు. జానశ్రుత్యాదులు భిక్షుకులు గారు. ఇంతియేల ఔపనిషద పురుషుని నిరూపించిన మహాపురుషు లెవ్వరును భిక్షుకులుగారు. "మేముకాముగాని ఓశిష్యులారా! మీరు మాత్రము భిక్షాచర్య నాచరింపుడు" అని యుపదేశించుచున్న దంతురా? అదియును కల్ల. సనకసనందనాదులు భిక్షకై తిరిగినట్లు వర్ణింప బడలేదు. పౌరాణికముగ శివుడు భిక్షయెత్తె నందురు. కానిందు ఆధ్యాత్మిక విద్యావిషయమున భిక్షాచర్యకు వేరర్థము కలిగియుండును. కావుననే 'ఉంఛవృత్తి' మున్నగునవి భిక్షాటనములుగావు. భిక్షాచర్య కొలుఁ గావచ్చును. యదృచ్ఛాలాభసంతుష్టుడై యెవ్వడుండ నేర్చునో వానిజీవనము భిక్షాచర్యమని పారిభాషికముగ వైదికభాష చెప్పు చున్నది. లోకమునందు బుద్ధియోగులగువారు తమకు లభించినదెల్ల భగవదనుగ్రహ భిక్షారూపమే యని భిక్షాచర్యమున నుందురు. రాజాధి రాజైనను తనసంపదయెల్ల భిక్షాచర్యమని యూహించుకొనవలయునని బోధించుచున్నది. ఎవ్వరిదైశ్వర్యమైనను సహాయభిక్ష పరిశ్రమభిక్ష అనుగ్రహభిక్ష ఆశ్రయభిక్ష అయి ఎల్లదియు భగవదనుగ్రహభిక్షారూప మని ఎరుంగవలయును. ఆ యభిప్రాయ ముండుటచేతనే జగజ్జనకుడైన భగవంతుడు శివుడే స్వయముగ భిక్షానంపన్నుడని వర్ణించిరి. కావున ఆధ్యాత్మిక విద్యాసంపన్నులు చేత జిప్ప బట్టుకొని ఇంటింటికి తిరిగి భిక్ష ఎత్తవలయునని ఏ గురువును విధింపడు; ఏ వేదమును విధింపలేదు; అపార్థ మును గావింపకుడు. అనగా ఔదాసీన్యవృత్తికే భిక్షాచర్య మని పేరు. సూత్రకర్తలును ఉపనయనకాలమునందు విధించిన భిక్షాటనము భిక్షా చర్యవ్యాఖ్యాన భూతక్రియావిశేష మను నభిప్రాయములో "నాత్మ

ప్రయోజనః చరేత్" అని విధించిరి. ఈ భిక్షాచర్య పదము తన పారి
భాషికార్థమును కోల్పోయి భిక్షాటన పర్యాయముగ వ్యాఖ్యానింప
బడుట మనదురదృష్టము. గీతలయందును యజ్ఞశిష్టాశులు అని భిక్షాచర్య
మునకే వ్యాఖ్యానప్రాయముగ చెప్పబడియున్నది. అన్యోన్యదానాదులచే
జీవయాత్ర నిర్వహింపబడుట నిక్కము. ఈ విషయమున కాళిదాసు
చక్కగ వర్ణించినాడు: "సంపద్వినిమయేనోభౌ దధతుర్భువనద్వయం"
భూమీశునకును స్వర్గేశునకును సంపద్వినిమయమును వర్ణించియుండెను.
దిలీపునినుండి ఇంద్రుడు యాచించి, ఇంద్రునినుండి దిలీపుడు యాచించి
లోకద్వయమును కాపాడిరి. వారి చర్యయే భిక్షాపరిగ్రహచర్య కాగా
ఇక మిగిలినవారిమాటయేల! గీతలయందును "తైర్దత్తా న ప్రదాయైభ్యో
యోభుంక్తే స్తేన ఏవసః" అని భిక్షాచర్యాచరణరూపమగు కర్మను
నిష్కామము గావించుటకు చెప్పియున్నాడు. దానినే భిక్షాచర్యమని వాడు
దురు. కావుననే ఆసుర సంపద్వర్ణనా సందర్భమున "యక్ష్యే దాస్యామి
మోదిష్యే ఇత్యజ్ఞాన విమోహితాః" అని వర్ణించి యుండెను. కావున
అందరును భిక్షుకులుగ నుండవలయుననియే పరిభాషా తాత్పర్యము.
అట్లుండకుండుట ఆసురసంపద. ఇట్లు చెప్పుటవలన సంపాదిత సంపత్తి
యందు పూర్వ ముపదేశించిన స్వీయత్వత్యాగబుద్ధి చక్కగ ప్రబోధింప
బడిన దగును. భిక్షాచరణ మనగా నిష్కామ కర్మాచరణ మని "త్యక్త్వా,
భుంజీథాః" అని బోధపడును. "కరతల భిక్షా, తరుతలవాసః" అనునది
కేవలాక్షరములతో వేదములందు గానవచ్చునేని నిశ్చయముగ చిప్ప
బట్టి ముష్టియెత్తు కొనుమని విధింపవచ్చును. భిక్షాచర్య వేరు భిక్షుకచర్య
వేరు "న్యాసః ఏవ" అను శ్రుతికి సన్యాస పర్యాయముగ నర్థము చెప్పుట
పొసగనిదే. వర్తమానకాలమునందు సన్యాసశబ్దమునకే యర్థము
కాషాయాంబర ధారిత్వాదికము గ్రహింపబడుచున్నదో దానినే మేము
నిరసించుచున్నాము. న్యాసమనగా (నితరాం అస్యతే నిక్షిప్యతే ఇతి

న్యాసః" ని+అసః) బ్రహ్మార్పణబుద్ధితో నుండుట యని తాత్పర్యము. ఈమంత్రమునం దుపయోగింపబడిన సంభూతిశబ్దము పూర్వమంత్రముల యందలి "పరిభూః స్వయంభూః" అను పదములయొక్క మూలధాతువు నుండి వ్యుత్పన్నమైన పదము. కావుననే సంభూతికి విద్య యనియు అసంభూతికి అవిద్య యనియు యర్థము చెప్పవలసివచ్చును. అవిద్య అసంభవ రూపమునందు నదే నైనను విద్యా సాహచర్యమున సంభవ రూప విలసితమగును. అప్పుడే నామాస్యము కాగలదు, కావున సంభూత్యసంభూతులను ప్రత్యేకించి వారు ప్రవర్తింతురని నిర్ణయించుచున్నాడు. అసంభూతియందు మాత్రమే మువ్వగు వక్తులగుదురో అట్టివారు తామసికులు, సందేహము లేదు. కాని అంతకుమించిన తామసికులై పోదగుదురని ప్రత్యేకింపబడిన విద్యోపాసకులను నిందించుచున్నాడు. అనగా నిర్గుణోపాసన మని ఉపాసనాంగమునకు చెందని యందమగు మాటలతో కాలము వెళ్ళబుచ్చు పురుషులు తామసికాధిక తామసులు సుమా యని చెప్పుచున్నాడు. గీతయందును, "అవ్యక్తా హి గతి ర్దుఃఖ దేహవద్భిరవాప్యతే" అని స్పష్టముగ చెప్పియున్నాడు. ఇంతయేల గుణమే లేకున్న యుపాసనమే లేదు. నిర్గుణోపాసనము వంధ్యా పుత్రులను గురించి యుద్దేశింపబడినది.

## ౧౩. మంత్రము

అన్యదేవాహు స్సంభవా దన్యదాహు రసంభవాత్
ఇతిశుశ్రుమధీరాణాం యేనస్తద్వ్యాచచక్షిరే॥

తా॥ ఈమంత్రమువలన సంభూతి శబ్దమునకు సంభవమని యర్థము చెప్పదగునని అనుమతించుచున్నది. సంభవమనగా అస్తిత్వము;

అసంభవమనగా నాస్తిత్వము. ఇంతవరకును అందరును సమ్మతింతురు. కాని 'సంభవాత్' అనునప్పుడు కార్యబ్రహ్మోపాసనార్థముగను 'అసంభవాత్' అనునప్పుడు ప్రకృత్యుపాసనముగను వ్యాఖ్యానించి సంభూతి యనగా హిరణ్యగర్భుడు అని యేమిటో వ్రాసిరి. ఆ హిరణ్యగర్భాది ప్రసక్తి యుండుటలేదు. ప్రకృత్యుపాసన మెందును ఉపదిష్టము కాలేదు. విద్యావిద్యలుగ చెప్పుకొందమన్నను కార్యబ్రహ్మవిద్య యను వ్యవహారమైనను లేదు. కావున ఉపాసనా పర్యాయముగు నర్థము చెప్ప వలసివచ్చినప్పుడు సంభవోపాసన మనియు, అసంభవోపాసన మనియు, చెప్పి సంపదకోపాసన మనియు ప్రతీకోపాసన మనియు సమన్వయించు కొన్న సుఖముగనుండును. కేవలప్రతీకోపాసనయు కేవలసంపదకోపాసనము ప్రమాదకారణములు ప్రతీకసంపదక సంయోగము సుఖముగ నుండును. కావున పదియవమంత్రమునకగు వ్యాఖ్యానమే యుండునుశబ్దాంతరములతో చెప్పబడెను. ఈ యభిప్రాయమును ప్రతిపాదింప గీతయందు "అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్। పరంభావ మజానంతో మమ భూతమహేశ్వరం" అని చెప్పియుండెను. మానుషాకారసంపన్నుడగునప్పుడు భగవంతు డెట్లగును అని భగవత్సమగ్రహావము నెరుంగక మూఢులు నిందింతురు అనిస్పష్టముగ చెప్పియున్నాడు. ఇదియే ప్రతీకనింద సంభూత్యసంభూతి సామరస్యమునకే గీతలయందు విభూతి యోగ మారంభింపబడెను.

## ౧౪. మంత్రము

సంభూతించ వినాశంచయస్తద్వేదోభయగ్ంసహ ।
వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యాఽమృతమశ్నుతే ॥

తా॥ ఈ మంత్రమునందు విద్యావిద్యల విషయమే మరియొక

రీతి చెప్పబడుచున్నది. కావున పూర్వమంత్రములయందు ఎట్లు విద్యావిద్యల యన్వయ మయ్యెనో అట్లే యిందును అన్వయము చేసికొని తీరవలయును కాని సంభూతి యనగా అసంభూతియనియు, వినాశమనగా అవిద్యయనియు విభాగించుకొని చెప్పవలసిన ఆవశ్యకత కానరాదు. వర స్మంత్ర రహస్య శ్లోకములయందును "సంభూతిం కార్యం రూపంచ వినాశం కారణాత్మకమ్" అని సంభూతి శబ్దమునే ప్రయోగించెను. కావున యీ మంత్రమునందు సంభూతియు వినాశమును ప్రసక్తములై యుండెను వినాశము మృత్యు కారణ కారణమని చెప్పుటచే పూర్వ మంత్రమునందలి మృత్యు కారణకారణమైన అవిద్యయే అర్థమని చెప్ప వలయును. వినాశనమునకు అవిద్య యని యర్థ మగునపుడు సంభూతికి విద్య యనెడు అర్థము స్వయము లబ్ధ మగును. మరియొకమాట విద్యావిద్యల ప్రశంస కావించుటవలన విశేషార్థ మిం దున్నదనియు పూర్వమంత్ర బోధమువలన నివారితములు కాని సందేహము లిందు నివారింపబడుచున్న వనియు గ్రహింపవలయును. లోకమునందు సశరీర ముగ స్వర్గాదిలోకములను పొందుచున్నారనియు ముక్తులగువారు యీ శరీరముతోడనే యుందురనియు, ఒకవిధమగుభ్రాంతితో కొందరున్నారు. మృత్యువునుజయించుట యనగా చావు లేకుండునట్లు చేసికొనుటయే మో అనెడు భ్రాంతితో నున్నారు. దీనికొరకే మృత్యుంజయ మంత్రము లనియు, మృత్యుంజయోపాసన మనియు, చిరంజీవులగుట యనియు, సంప్రదాయము లుద్భవించినవి. యోగములయందు గూడ లంబికా యోగ మని మృత్యురాహిత్యోద్దేశమున అవలంబింప బడుచున్నవి. కనుక ఈ భౌతిక శరీరము విద్యాప్రాప్తివలన అప్రాకృత శరీరమై బొగ్గు వజ్రముగ పరిణమించినట్లు వజ్రదేహు లగుదురేమో యనెడు భ్రాంతి యున్నది. ఈభ్రాంతి నాధారముచేసుకొనియే జైనమతము మున్నగు మతములలో,రోగరాహిత్యము దేహసౌందర్యము దేహబలము మున్నగు

నవి మహాపురుష లక్షణములుగ భావింపబడినవి. వేదములయందును చ్యవనుడు ముదుసలితనమును జయించి యువకు డయ్యెననియు, పురాణములయందు ధర్మరాజాదులు తమ పెంపుడుకుక్కలతో కూడ స్వర్గారోహణము గావించిరనియు, నారదాదులు మూడులోకములను తిరుగుచుండనియు, అర్జును డొకప్పుడు ఇంద్రలోకమున కేగి వచ్చెననియు చెప్పబడియున్నవి. ఇవియన్నియు అర్థవాదములుగాని సిద్ధాంతములు గావు. ఇట్టిసందేహములనెల్ల నివారించుటకు ఈ మంత్రము ప్రారంభింపబడెను. మరియు నొకచో స్పష్టాక్షరములుగ "భస్మాంతగ్ం శరీరం" అని సిద్ధాంతీకరించియున్నాడు. ఇక మృత్యువును జయించుటయన నేమియో చెప్పుచున్నాడు. శరీరమునకు మరణము కలిగినను తనకు మరణము కాదని నిశ్చయ జ్ఞానము కలుగుట మృత్యుంజయము. ఈ మృత్యువు వికృతిరూపమా ప్రకృతిరూపమా యని సందేహించి నివారించుచున్నాడు. మృత్యువు ప్రకృతిరూపము కావున మృత్యువనునది తనకు భంగము కాదని నిరోధము కాదని విరోధము కాదని సంపూర్ణవివేకము కలుగవలయునన్న వినాశరూపజ్ఞానముపై నాధారపడియుండును. గీతలయందును "సమం సర్వేషు భూతేషుతిష్ఠంతం పరమేశ్వరం వినశ్యత్స్వ వినశ్యంతంయః పశ్యతి సపశ్యతి(13-27)" స్పష్టముగ వినాశ అవినాశశబ్దము లుపయోగింపబడెను. మ యు అనంతర మంత్రమునందు "సత్యస్యాపిహితంముఖం" అని చెప్పి "అపావృణు" అని ప్రార్థించుచున్నాడు. దీనినిబట్టి పాత్రదూరీకరణము వినాశజ్ఞాన కారణమని నిరూపించుచున్నాడు. ముఖ్యముగ ఈ మంత్రముపాసనావిషయము కావున ఉపాసకాలంబపాత్రములైన ప్రతీక ప్రత్యయములు కూడ సంభూతియందు అమృతమయములగునని "సంభూత్యా అమృతమశ్నుతే" అని స్పష్టపరచెను. పరమనిర్ణయమునందును "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని సర్వము బ్రహ్మము చెప్పుటచే వినాశావినాశములు పరంపరగ బ్రహ్మానందామృత కారణములని దృఢీకరించు

చున్నాడు. కావున వినాశజ్ఞానము కలుగక విద్యాప్రాప్తి కలుగదనియు విద్యాజ్ఞానము విడిచి వినాశప్రాప్తియు బోధపడదనియు అట్టివానికి పుట్టుట చచ్చుట యనెడు యీరెండుగతులలో కొట్టుకొనిపోవుట తప్ప వేరుపాయము లేదని చెప్పి వినాశసంభూతుల యొక్క సమంజసైక్య జ్ఞానమువలన అమృతప్రాప్తి లభించునని ఉపసంహరించుచున్నాడు.

## ౧౫. మంత్రము

హిరణ్మయేనపాత్రేణసత్యస్యాపిహితంముఖం
తత్త్వంపూషన్నపావృణు సత్యధర్మాయదృష్టయే॥

తా॥ ఇంతవరకును విద్యారూపము అవిద్యారూపమును సంగ్రహముగ చెప్పించి తొమ్మిదవ మంత్రమునందలి "ఉపాసతే" అను పదము వలన ఎత్తుకొనబడిన ఉపాసనారూపమును పరమకారుణ్యముతో ఈ మంత్రమునందు నిరూపించుచున్నాడు. 9 వ మంత్రమునకును ఈ మంత్రమునకును సంబంధమున్నదని చెప్పుట దూరాన్వయమువలె సాధారణులకు తోచవచ్చును కాని విద్యావిద్యానిరూపణానంతరము చెప్పవలసినది ఉపాసనావిషయమే గావున దానితోడనే దీనికి సంబంధము. కొందరీమంత్రములను మరణకాల జ్ఞాపకములని వ్యాఖ్యానించిరి. అదియంతయు స్వకపోలకల్పనమే. ఈమంత్రమునందు "త్వం అపావృణు" అని ప్రార్థనారూపమున్నది. ఇందు ప్రార్థింపబడినపురుషుడు "పూషన్" అని పిలువబడెను. పూషన్ శబ్దమునకు సూర్యుడని లౌకికార్థము. కాని యిందలి పూషన్ శబ్దము ఉదయాస్తమయ వ్యాపారలక్షణ లక్షితుడైన సూర్యుడుకాడు. ధ్యానగమ్యుడైన సూర్యుడు. అయినను

ధ్యానగమ్య సూర్యునియందు ఔపచారికముగ ఉదయాస్తమయ లక్షణము లారోపించుట స్పష్టబోధము కొరకని యెఱుంగవలయును. ఇదియే గాయత్రీ పరమరహస్యము. "తత్సవితుర్వరేణ్యం దేవస్య ధీమహియోనఃధియః ప్రచోదయాత్" అని స్పష్టముగ ధ్యానకాలమునందలి బుద్ధినైశిత్యమును వర్ణించుచున్న గాయత్రీమంత్రమున కుపాస్యుడైన సూర్యుడే యిందు గ్రహింపబడుచున్నాడు. ఉపాసకుడు బుద్ధియోగమునందలి ధ్యానయోగ మవలంబించు నపుడు సర్వ సాధారణముగ ప్రారంభమునందు తేజోదర్శనమే యగును. అంధులగువారో తేజస్స్పర్శానుభవము కలుగును. మరియును జ్ఞానేంద్రియములలో ఏ ఇంద్రియము ప్రబలముగనున్న ఆ యింద్రియమునకు గమ్యరూపమై ఆ తేజస్సే పరిణమింపగలదు. ఆ తేజస్సే ధ్వనిరూపముగను, కాంతిరూపముగను, ఉష్ణస్పర్శరూపముగను అట్లు తత్తద్రూపముల పరిణమింప గలదని విజ్ఞు లెఱుంగుదురు. శాస్త్రీయముగ నింత చెప్పగలిగినను అనుభవ రహస్యమిందు చెప్పుటయు ధర్మము. అంధులైనను భగవద్రూప దర్శన విషయమున సమర్థులగుటకు తత్కాల దృష్టి తత్కాలరూప జ్ఞానము తిరుగ కలుగును. పౌరాణిక యుగ లీలాశుకాదు లుదాహరణములు. ఇచ యిచ్చుచుండవలెను "ఓ సూర్యా! హిరణ్మయమగు పాత్రముచే సత్యము యొక్క ముఖము కప్పబడినది. నీవు సాక్షాత్కారముకొరకు ఆపాత్రమును తొలగింపుమా!" అనిస్థూలముగ మంత్రార్థమగుచున్నది. కాని సూక్ష్మముగ నెంతయో విచారింపవలసియున్నది. "సత్యస్య ముఖం అపిహితం" అను వాక్యములోగల సత్యశబ్దమునకు భగవంతుడని యర్థము. ఆభగవంతుని యొక్క ముఖము కప్పబడినది. అనగా భగవద్దర్శనము కాకున్నది అనియర్థము. ఆత్మదర్శనము ఆత్మశ్రవణము ఆత్మమననము ఆత్మనిధి ధ్యానము మొదలగు ఆత్మానుసంధానకార్యములు దూరమగుచున్నవి. ఇట్లు దూరమగుటకు కారణ

మేమి? ఆ సత్యముఖము కప్పబడుటకు కారణమేమి? అని విచారింపగా మంత్రమే చెప్పుచున్నది — పాత్రేణ అను పదముతో స్పష్టము చేసెను. పాత్రముచేత కప్పబడెను అనియర్థము. ఇందలి పాత్రశబ్దము వ్యాఖ్యాతల కందరకును కంఠపాశ మైపోయెను. పాత్రమనికొందరు, కుండయనికొందరు, ఘనీభూతమైన తేజస్సని కొందరు, రశ్ములిందు పూరింపబడును కావున పాత్రమయ్యెనని కొందరు నానా విధములుగా చెప్పియున్నారు. ఇందలి పాత్రశబ్దమునకు ఉపాధివాసనా పరిణత దుర్నివారజ్ఞానమే అని అర్థమును చెప్పవలయును. ఆధారాధేయ భావముతో లోకమునందు ఏవస్తు జ్ఞానమైన కలిగియుండుటవలన అట్టి అవశ్య జ్ఞానప్రాప్తికి పాత్రమని పేరు. సంగ్రహముగ "ఉపాధి" అని చెప్పవచ్చును. వేదకాలమునుండి నేటివరకును ఈ ఉపాధిని 'ఘట' శబ్దముతో వాడుట ఆచారమైయుండెను. ఈ ఘట మింక నిలువదు అనగా ఈ శరీరము నిలువదనియర్థము. కావున పాత్రమునకు ఉపాధి యని అర్థము. మరియును మూతకు పాత్ర ముపయోగింప బడును కావున పాత్రశబ్దార్థము సందిగ్ధమయ్యెను. అందుచే ఔపాధిక బంధమే పాత్రమని చెప్పవలసివచ్చెను. ఇంక ఈ పాత్ర మెట్టిదని శంకించి సమాధానమిచ్చుచున్నాడు. హిరణ్మయమగు పాత్రముచే గప్పబడెను. హిరణ్మయమననేమి? ఇది కేవల వైదికపరిభాష. అనిర్వచనీయవర్ణాత్మకమైనదానిని హిరణ్మయమనియు, హిరణ్యమనియు చెప్పెదురు. ఉదకము లు హిరణ్యవర్ణములు అని వేదమునందు వర్ణింపబడినది. అందలి హిరణ్య శబ్దమునకు అనిర్వచనీయమని యర్థము చెప్పిరి. హిరణ్మయ శబ్దమును ప్రకృతి ప్రత్యయ విభాగముచేయగ 'హిరట్ + మయ' అని యేర్పడును. అందలి 'హిరట్' అను శబ్దము వేదములయందుపయోగింపబడిన నిపాతములవంటిదై యుండును. ఏదియెట్లున్నను అనిర్వచనీయమనుటలో సందేహము లేదు. ఈదేహముగూడ అట్టి అనిర్వచనీయ

వస్తువిశిష్టమైయున్నది. 'ఆనఖశిఖము' బహురంధ్రమయమై నీ రంధ్రముగ మోహజనకమై కన్పట్టుటలేదా? అట్లనిర్వచనీయమై యుండుటం బట్టియే హిరణ్మయశబ్ద ముపయోగింపబడెను. ఉపనిషత్తులయం దటనట "తస్మిన్నయం పురుషః హిరణ్మయః" ఇత్యాదిగ కన్పటుచున్నది. కావున సువర్ణమయపాత్రముచే అనునర్థము పొసగదు. అనిర్వచనీయమైన ఔపాధిక వాసనాప్రాబల్యముచేత ఆచ్ఛాదింపబడి యున్నదని యర్థము చెప్పుకొనుట సుగమము. అందుచేతనే "మేధయా పిహితం" అనుచోట ఔపాధిక వాసనా వాసిత జ్ఞానముచే అని ఆచార్యులచే నర్థము స్వీకరింపబడెను. ఈ హిరణ్మయపాత్రముచే సత్యముఖ మాచ్ఛాదింపబడుట వలన అనేక ప్రమాదములు సంభవించుచున్నవి. భగవంతుడు శక్తిమాత్రరూపుడని కొందరును, కోటిసూర్య ప్రభా భాసమానుడని కొందరును, 'నీ రూపనిరవయవ' నిష్క్రియుడని కొందరును అవగాహనమైనను కాకున్నను నేదియో చెప్పుకొనుచు భగవత్సాక్షాత్కారమసంభవమని నిర్ణయించుకొని దాక్షిణ్యము కొరకేమో యనునట్లు కొందరుపాసకులుగ నటింతురు. బ్రహ్మసాక్షాత్కారమనియు, ఆత్మసాక్షాత్కారమనియు, బ్రహ్మోపాసనమనియు, నిర్గుణోపాసనమనియు సమాసపదములను సంఘటింపవచ్చునుగాని సత్యముగ అట్టి సాక్షాత్కారముగాని అట్టి యుపాసనముగాని లేదు. కావున తదుపాసకులు తద్విదూషకులు. ఆత్మ దర్శింపతగినది "ఆత్మావా అరే ద్రష్టవ్యః" అని చెప్పునప్పుడును 'తత్త్వదర్శినః' అని చెప్పు నప్పుడును దర్శనమున కసంభవములైన ఆత్మతత్త్వములు కలవుగదా అని శంకింపకుడు. ఉపనిషత్తులయం దుపదేశింపబడిన ఆత్మరూపము భగవద్రూపముగ నుపాసింపవలయునని చెప్పుచున్నది. కనుకనే దర్శన శ్రవణ మనన ధ్యానాదులు ఆత్మవిశిష్టములుగ వర్ణింపబడినవి. తత్త్వదర్శియను నప్పుడు తత్త్వానుభవవంతుడని యర్థము. అట్టివాడు మహాత్ముడై యుండును.

ఆ మహాత్ముడే సత్యోపాసకుడు. కావుననే గీతలయందు "వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః" అని స్పష్టముగ చెప్పబడియున్నది. ఆ భగవద్దివ్య రూపసందర్శనాభిలాషముతో మహాపురుషు డుపాసకుడై తన ఉపాసనా ప్రారంభమున సర్వసాధారణ సాక్షాత్కార యోగ్యమైన తేజోరూపమును సూర్య ప్రతీకముగ నిశ్చయించి "ఓ సూర్యుడా! ఆ సత్యమును నన్ను జూడనిమ్మని యీ ఔపాధిక దురోమ్మాహమును తొలగించి కళ్యాణ తమమైన ఆదివ్యరూపమును జూడనిమ్మనియు ప్రార్థించుచున్నాడు. ఉపాసనా సమయమునందు చర్మ నేత్రములను రెండింటిని మూసియే ధ్యానింపవలయును. చర్మనేత్రములు రెండు మూసినంగాని దేహములోపలనుండిన దివ్యనేత్రము తెరువబడదు. దివ్యనేత్రమన గా మనోనేత్రమని కొందరు వ్యాఖ్యానించిరి. అదితప్పు మనస్సునకొక నేత్రములే ; నేత్రముండినచో మిగిలిన యింద్రియములును ఉండవలయును. దివ్యశోత్రము, దివ్యజిహ్వా, దివ్యనాసిక - ఇట్లే దివ్యత్వము నన్నింటికిని అంటగట్టవచ్చును అది అసంప్రదాయము. దివ్యచక్షుస్సు ప్రత్యేకముగ నొక నేత్రభూతావయవము శరీరములో గలదు. ఆ అవయవము శరీర శాస్త్రజ్ఞ గమ్యమాయని శంకింపనక్కరలేదు. షట్చక్రములు కుండలినీశక్తి రూప వస్తువు మనస్సు మున్నగు శారీరిక వస్తుసమూహా మెట్లు శరీర శాస్త్రజ్ఞుల కగమ్యమో అట్లే యీదివ్య చక్షుస్సుకూడ కేవల శరీర శాస్త్రజ్ఞుల కగమ్యమైయుండును. అంతమాత్రమున దివ్యచక్షుస్సు లేదన రాదు "దివ్యంచక్షుః దదామి" అని గీతలయందు స్పష్టముగ దివ్యచక్షుస్సు వర్ణింపబడెను. ఆచక్షుస్సు తెరువబడవలయునన్న చర్మచక్షువులు మూయబడవలయును. చర్మచక్షువులు మూసినంత మాత్రమున దివ్యచక్షుస్సు తెరువబడి రూపగ్రాహకము కానేరదు. గాజుకన్నువలె యూరకుండును. దానికి దర్శనశక్తి భగవత్కటాక్షమువలన గురుప్రసాదమువలన కలుగును. ఆకటాక్ష ప్రసాదములు విద్యావిద్యోభయాధీనములైయుండును.

కావున విద్యావిద్యలను ప్రశంసించి దివ్యచక్షుఃప్రభావమును వర్ణించుచున్నాడు. ఈదివ్యచక్షుస్సునకు ప్రారంభమున కానవచ్చిన సూర్యుడు లోకసాధారణ సూర్యుడుకాడు. ఈసూర్యుడసాధారణుడు. ఈసూర్యుని యందే ఆనారాయణపురుషుడు భగవంతుడు సవితృమండల మధ్యవర్తియై యున్నాడని పరంపరలో వర్ణించుకొందురు. కాని మనకు సాధారణముగ కానవచ్చెడి సూర్యమండలమందుగు లేదు. ఉపాసకునిచే గ్రహింపబడి సద్గురూపదిష్టమార్గమునందలి భగవద్రూపమే చూచుటకు ప్రయత్నించిన వాడై సత్యధర్మమగు దృష్టికొరకు ఆమునుగును తీసివేయుమని ప్రార్థించుచున్నాడు. ఆ దృష్టివిశేషము సత్యధర్మము గలది. అట్లగుటంబట్టి కాల్పనికముగాదు. ఉపాసకులహితము కొరకు రూపకల్పనమని సమన్వయించుటయు అన్యాయము. అన్నాదుల యందు త్రుంచి వారణ ధర్మముండిన యట్లు ఆ రూపమునందు సత్యధర్మమున్నది. త్రుంచి వారణాత్మము కాల్పనికము కానియట్లు రూపదర్శనము కాల్పనికముకాదు. ఎరిగియో ఎరుగకయో ఒకవిత్తనమును తీసికొని భూమియందు నాటగా ఆవిత్తనము నాటినవాని సంకల్పముతోడ సంబంధము లేక తనయందున్న రూపముతో విజృంభించినట్లు ఉపాసకునిచే దర్శింపబడు రూపము కాల్పనికము గాక సత్యమై జ్ఞానమై అనంతమై ధర్మ్యమైయుండునని నిర్వచించుచున్నాడు ఈసిద్ధాంతమునకు బీజరూపమగునది "తత్త్వమసి" అను మహావాక్యమైయున్నది. కావుననే అది మహావాక్యము. ఇట్టి నిర్ణయానుభవము కలుగుటచేతనే సర్వప్రపంచమునం దొక్క రీతి దేశ కాల పాత్రభేదము లేక భగవద్రూపసందర్శనభాగ్యము కలిగెను. వేదఋషులు తమశిష్య పరంపరలో ఈరహస్యమును బోధించి విడిచిరి. దానిని స్పష్టాక్షరములుగ వర్ణింపలేము. తమ యానందానుభవమును వాచోవిధేయము చేయుట బహు కష్టమని రసజ్ఞులెరుంగుదురు. పురాణములలో గజేంద్రుని ప్రార్థనము

మెట్టవేదాంతపు మార్గమునంబడిపోయి యుండెను. అట్టియ్యును మహో
పాసకుడుగావున తనకు సంకల్పము లేకున్నను కాల్పనికముగాకున్నను
శాత్వికమునుధర్మ్యమునుఅగురూపముదృష్టమైనట్లువర్ణింపబడియున్నది.
ఖండాంతరమునందు "పాల్" అను మహాభక్తుడు భగవదుపాసకుడై
కాల్పనికముగాని సంకల్పానకాశము లేని ఒకానొక దివ్యతత్త్వరూపమును
దర్శించెను. ఆ రూపమును గజేంద్ర దృష్టరూపమును ఒక్కటియే.
వేమోల అంశము కాల్పనికమును ఉద్దండ మహాతర్కవాద మహాసంక్షోభ
కాలమునందు కూడ అనూయిపుడై కాళీసమారాధకుడై కట్టకడపట
సంకల్పములేకయే కాల్పనికము కాకయే ఒకానొక అలౌకిక దివ్య
స్వరూపమును సందర్శించిన ఆ శ్రీరామకృష్ణ పరమహంస ఈ విషయ
మున జగద్గురువని నొక్కి చెప్పుచున్నను ఆరూపము నిదియు నొక్కటియే
యగనధికము వ్రాయనక్కరలేదు. ఇట్టి పరమసూక్ష్మము తెలుసుగ వలయు
నన్న బుద్ధియోగము శరణ్యమని శ్రీకృష్ణుని ప్రతిజ్ఞావాక్యముగలదు.
బుద్ధియోగులై ప్రసిద్ధులుకండు!

## ౧౬. మంత్రము

పూషణ్ ఏకర్షే యమసూర్యప్రాజాపత్య వ్యూహరశ్మీన్
సమూహతేజోయత్తేరూపం కళ్యాణతమంతత్తేపశ్యామి
యో ఽ సావసౌపురుషః సో ఽ హమస్మి॥

తా॥ ఈ మంత్రమునందు పూర్వోక్తుడగు సూర్యుడే ప్రార్థింప
బడుచున్నాడు. ఐనను ఆసూర్యునియొక్క ప్రత్యేకాస్తిత్వమును నిర
సించుచు "యేనభాసాసర్వమిదంభాతి" అనున్యాయమునుబట్టి "పూషన్,
ఏకర్షే, యమ, సూర్య, ప్రాజాపత్య." అని ఐదునామములతో పిలుచు

చున్నాడు. ఈ భిన్ననామములును సార్థకములు. ఈమంత్రము మార్గ యాచనము కొరకని కొందరు వ్యాఖ్యాతలు వ్రాసిరి. అర్చిరాది మార్గ ములు యాచనాధీనము లెంతమాత్రమును గావు. మరియును మార్గము అను శబ్దమీమంత్రమునం దెందును వాడబడలేదు. కనుక మరణ సమయ, మార్గయాచనము అప్రసక్తము. మంత్రోద్దిష్ట సూర్యుడు గోళసూర్యుడుకాడు. ఈ యుపనిషత్తు ఈశావాస్యముగాని సౌరికాదు. సూర్యోపాసనమునకై పుట్టలేదు. కావున సౌరమునుగాదు. ఈమంత్ర మునందు కల్యాణతమ మగు రూపమును చూతునుగాక అని యున్నది. అనగా ఉపాసకుని యత్యంతప్రధానకార్యమైన భగవద్రూప సాక్షా త్కారమే యిందు వర్ణింపబడెను. "తత్ కల్యాణతమం రూపంపశ్యామి" అని మంత్రవాక్యము. తద్వాచ్యమై సచ్చిదానందవాచ్యమై తల్లక్ష్యమై ఔపనిషదమైన పురుషరూపమును చూతునని యీవాక్యమున కర్థము. తత్పురుష కల్యాణరూపదర్శన సమయమునందు విఘ్నరూపముగనుండిన సూర్యరశ్ములను దూరీకరించి కేంద్రీకరింపుమని ఉపాసకుడు ప్రార్థించు చున్నాడు. ప్రార్థించినను ప్రార్థింపకున్నను యీపని అగుననెడు తత్త్వము వర్ణింపబడియున్నది. "యో సా వసౌ పురుషః సో ఽ హమస్మి" అను వాక్యమును కొందరు వ్యాఖ్యాతలు తమయిష్టము వచ్చినట్లు వ్యాఖ్యా నించిరి. కావున యిందలి వాక్యవిభాగమును తెలుపుచున్నాము. "యః అసౌ.అసౌ సః పురుషః. అహమస్మి" "యః అసౌ" అనువాక్యము "ఎవడు వీడో" అనుఅర్థము నిచ్చును. ఇంతకుమునుపు యేపురుషుడు వర్ణింపబడి యుండెనో ఆపురుషు డుపాసనాకాలమునందు దృగ్గోచరీభూతుడగుటం బట్టి నిర్దిష్టముగ ఇతడుఅతడు అని నిరూపించుచున్నాడు. రెండవ వాక్యము ఉల్లాసాతిశయముచే ఆనందార్థముగ ద్విరుక్తిగ చెప్పుచున్నాడు. 'వీడే ఆ పురుషుడు' అని రెండవవాక్యమున కర్థము. దృశ్యమానుడే వర్ణితపురు షుడు అనియర్థము. అట్లుకాకుండినచో యిందుప్రయుక్తమైన సర్వనామ

శబ్దములు యేనామమును పరామర్శింపనేరనివై శక్తిహీనము లగును. ఇంతకుముందు 8. వ మంత్రమునందు 'కవిః' అనుశబ్ద ముపయోగింపబడి కవిః స్వయంభూః మొదలగు నామము లనేకము లుపయోగింపబడినవి. వానినే యిట పరామర్శింపనున్నాడు. ఇక 'అహమస్మి' అనువాక్యము సర్వైశ్వర్య స్థైర్యములుగల నేనున్నానని తాత్పర్యము. ధైర్యస్థైర్యాది గుణములుండను అను విశేషణమిందు లేకున్నను వక్తృ తాత్పర్య మదియని నిర్ణయించుట కవకాశము గలదు. సనాతన యుగ లోకమునందును 'అహమస్మి' యని ఎవడు పూనుకొనునో అట్టివాని వాక్యము వినబడుచుండును. ఇట్టి కొన్ని వాక్యములకు సంప్రదాయార్థములనే చెప్పవలయును. శబ్దార్థము లను చెప్పరాదు. పుస్తకము ఇత్యాదిక చదివెను. అనగా సంపూర్ణముగ చదివె నని యర్థము. ఇట్టి కొన్ని సాంప్రదాయిక వాక్యములు వేదముల నుండి గ్రహింపబడినవి కావున 'సోహమస్మి' అను వాక్యవిభాగ మున్నది. ఈ మంత్రము మరణవేళకు సంబంధించినది కాదు. తత్త్వో పాసకునియొక్క సిద్ధివేళయందు సంజాతమైన ఆనంద విశేషానుభూతి వర్ణింపబడుచున్నది. కావుననే ధీరుడై అహమస్మి అని యనుచున్నాడు.

ఆత్మసమర్పణము కావించినవా డగుటవలన ఆత్మాస్తిత్వము స్థిరముగ తనకిప్పు డవగాహనమయ్యెను. గీతలయందును "సర్వధర్మ త్యాగ పూర్వకముగ వర్తింపుము; నన్నే శరణుపొందుము" అని సుఖముగ బోధింపబడెను. ఆవిషయమే యిం దుపనిబద్ధమయ్యెను. కావున దర్శనవేళా ప్రారంభమున గోచరుడైన సూర్యుని ఐదునామ ములతో పిలిచెను. 'పూషణ్' అనగా ఉపాధిపోషకుడని యర్థము. ఋగ్వేదమునందు చరాచర జగత్తునకు సూర్యుడాత్మయని వర్ణింప బడెను. 'ఏకర్షే' అని సూర్యుని పిలుచుచున్నాడు. దీనినిబట్టియే గోళా కారక సూర్యుడు కాడని యర్థమగుచున్నది. పురాణాదులయందు సూర్యు డసహాయుడై యాత్రచేయుచున్నట్లు వర్ణింపబడలేదు కావున

ఓ భగవంతా నీయొక్క కళ్యాణతమమైన ఆ ప్రసిద్ధమైన రూపమును చూచువాడనై నేను [illegible] యున్నాను. [illegible] యొక్క [illegible] అంత యున్నది. [illegible] రూపమైన నీరూపమే [illegible] మన్నది ఇదియే [illegible] పరమచర [illegible] — ఇతి శిష్యః

# ౭. మంత్రము

వాయురనిల మమృత మథేదం భస్మాంతగ్ం శరీరం
ఓమ్ క్రతోస్మర కృతగ్ం స్మర క్రతోస్మర కృతగ్ంస్మర॥

తా॥ ఈ మంత్రమునందు మరణకాల ప్రార్థనమే యున్నదని కొందరందురు. ఉత్పత్తిసంబంధమేదియును లేదు కావుననే వీని స్వతంత్రంహా స్వార్థక శ్లోకములయందు దొరకదు ఉపాసకఫలమని వర్ణింపబడెను. ఈమంత్రమునందు వాక్యములు చిన్న చిన్నవిగనున్నవి. అర్థములతి గంభీరములై యుండును (1) వాయువు అనిలము అగుచున్నది (2) ఇంక యిది అమృతము (3) శరీరము భస్మాంతము (4) క్రతువా! కృతమును స్మరింపుము. (5) క్రతువా! కృతమును స్మరింపుము. ఈ వాక్యవిభాగమును బట్టి యీ మంత్రము ఉపాసకుని యొక్క ఫలరూపమును చెప్పుచున్నదని సులువుగబోధపడుచున్నది. మహా పురుషుల యుపదేశములయందిట్లే ఆనందపరవశ వాక్యములును వ్యవహారనిర్వాహక వాక్యములును సక్రమముగ యోజింపబడియుండును. మొదటివాక్యమున కర్థమువిండము. వాయువు అనిలము అగుచున్నది. వాయువు అన్నను అనిలము అన్నను సమానార్థకములే. ఇట్లు పర్యాయ నామములం జెప్పునట్టి నిఘంటువని యుపనిషత్తునకెన్నడును గాదు.

కావున పర్యాయపరముగ అర్థము చెప్పక [illegible] గ్రహింపవల యును. ఇందొకపదము విశేషణమై వేరొక [illegible] విశేష్యమై తీరవల యును. ప్రథమపదము 'వాయువు' కావున [illegible] విశేష్యము. యీ మంత్రమునందీ [illegible] ప్రసక్తియేల కలిగె [illegible] వాయువు సాధారణ లోక వాయువా? కాక ఉపాసక బోధ్య [illegible] ? అని శంకించినంగాని సమాధానము [illegible]. విద్యకు [illegible] లచినదగుటవలన యీ వాయువు ఉపాసకబోధ్యవాయువు [illegible]. ఉపాసకునిచే అవశ్యము [illegible] బడిన ప్రాణాయామ [illegible] వాయువే యిచ్చటి వాయువు. ప్రాణాయామము కుంభ ప్రధానమని [illegible] లందరెఱుంగు దురు. కుంభించిన వాయువు సూర్యదర్శనానంతరం గోచరీభూతమైన కళ్యాణతమరూప సాక్షాత్కార సమయమున [illegible] ప్రాణాయామము చేయబడుచున్నదా? కుంభముచక్కగ [illegible] యున్నదా? అనెడు యీ బాహిర వ్యాపారములును (ఈ భావనలు ప్రతీక ప్రత్యయ భూతములు) ప్రతీకభూత ప్రత్యయములును యీ మొదలగు సర్వము అలక్షితమైపోవును. వానికి [illegible] లేదు కావున ఆ వాయువు అనిలము" ఇలా సంబంధము కాకుండగుచున్నది అని యర్థము. అనగా ప్రపంచ వాసనానుసంబంధమైన [illegible] ఆ వాయువునకు పోవు చున్నదని యర్థము. దర్శనపూర్వమునందే కుంభలక్ష్యముగాని దర్శన క్షణమునుండి కుంభలక్ష్యమక్కరలేదు అక్కరలేదని చెప్పినను చెప్ప కున్నను అక్కరలేని దేయగును.(ఇలానంబంధము కానిది అనిలము) రెండవ వాక్యమునందు "విద్యయాఽమృతమశ్నుతే" అనువాక్యముయొక్క ఉపసంహారముగలదు. అథ అను శబ్దమిందున్నది. ఈశబ్దమునకు మరణా నంతరమని కొందరు వ్యాఖ్యానించిరి. మరణప్రసక్తిలేశమును నిందులేదు. ఈ 'అథ' శబ్దమునకు పూర్ణమైన మంగళమని చెప్పవలయును. దీనికి పూర్వమునందున్న 16 మంత్రమునందే "కళ్యాణతమం" అను పద

మున్నది కావున సంపూర్ణ మంగళరూపమైన యిది ఆ అమృతరూపమే యనియర్థము. ఇదియే శారీరక మీమాంసన శరీరధారిత్వమునకు పరమ ఫలమనియే. ఎల్లశరీరులును (మానవులు) అమృతప్రాప్తికి అధికారులు గదా! కావుననే శరీరప్రసక్తి సంభవించెను. తానమృతతా ప్రాశస్త్యము ప్రాంతగా శరీర మేమగునో యను శంకకలుగును. శరీరమునకమృతత్వ ప్రాప్తిలేదు. మూడవ వాక్యమునందు. స్పష్టముగ శరీరము భస్మాంతమని చెప్పి యున్నాడు. మరియును యెట్టివారిశరీరమును భస్మాంతమేయని యందరకు నెరుకపడియున్నది. దానిని వేదపురుషుడు చెప్పనేల? ఇందలి విశేష మేమియని వివేకింపుడు. ఔను జీవన్ముక్తులకు వారి దేహములు మాత్రమే భస్మాంతములు. ఇక వారికి దేహధారిత్వ రూపబంధము లేదు. కావున వారి దేహములు భస్మాంతములుగాని అందరి దేహములు భస్మాంతములు కావు. బుద్ధియోగేతరుల దేహములు మరణాంతములై యుండును. భస్మాంత మనగా పునరుదయావకాశము లేనిదని యర్థము. మరణాంత మనగా పునర్జన్మాస్పదములని యర్థము. ఈయర్థమునే గీతలయందును "జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువంజన్మమృతస్యచ" (అ 2—37) అనియును వేదములయందు "జాయస్వమ్రియస్వేతి తృతీయః" అనియును స్పష్టముగ చెప్పబడియున్నది. కావున జన్మమరణరూప ఘోరసంసార మహాంధకూప నిపాతము బుద్ధియోగులకు లేదని యర్థము. కాని అన్ని దేహములు భస్మాంతములే యన్నచో నాస్తికవాదము సంభవించును. భూతములు భూతములలో కలియుననియు జీవుడు నిశ్శేషుడయ్యెననియు చెప్పుకొనెడు నాస్తికవాదమే సిద్ధమగును. పాపము శాంతించుగాక! కొందరనినట్లు శరీరము భస్మమగుగాక అను యర్థము లేశమును రాదు. నాల్గవవాక్యమును రెండు వాక్యములుగ చెప్పుకొనవలయును. ఈ వాక్యమునందలి క్రతుశబ్దమునకు వేదసంప్రదాయము నందు చెప్పబడిన "క్రతుమయః పురుషః" అను క్రతుమయపురుషుడని యర్థము చెప్ప

[illegible]ను. ఈ క్రతుమయపురుషుఁడు అగు నుపాసకుఁడు 'ఓమ్' అను [illegible] ధాన సంప్రదాయము [illegible]రింపవలయునని తాత్పర్యము. "ఓం తత్స దితి నిర్దేశః బ్రహ్మణః [illegible]" అను గీతావాక్య మిచ్చట [illegible] మరియును [illegible]దులు ఓంకారపూర్వకముగ [illegible] బుద్ధితో చేయ[illegible] గీతోపదేశము గలదు. [illegible] క్రతుమయపురుషుఁడు కృతకృత్యుఁడగును. కనక ఓ యుపాసకా! ఓ [illegible]మయపురుషా! ప్రణవార్పితబుద్ధితో కృతమును స్మరింపుము. కృ[illegible]మును స్మరింపుము. అని ఆదరాతిశయమున ఆదేశించుచున్నాఁడు. [illegible] ఆమరణమును ఆ[illegible]ప్తిగను ("ఆసుప్తేరామృతేః కాలంన యే ద్వేదాంతచింతయా") కే[illegible]ధారణధ్యానసమాధిలో నుండదగదు. అది వ్యవహారభంగము. [illegible]లోకసంగ్రహనిగ్రహము. లోకసంగ్రహము కూడ నొక కార్యమై యున్నది. అదియు నుపదేశాంతర్భూతమై యుండును. కావున కడపట "కృతం స్మర కృతంస్మర" అని ద్విప్రకారముగ ప్రవచించెను.

## ౧౮. మంత్రము

అగ్నేనయసుపథారాయే అస్మాన్విశ్వాని దేవవయునాని
విద్వాన్, యుయోధ్యస్మజ్జు హురాణమేనో భూయిష్ఠాంతే
నమ ఉక్తిం విధేమ॥

తా॥ ఈమంత్ర మువసంహారాత్మకము. కొందరి మతములో యీ యుపనిషత్తునందు పదునేడు మంత్రము లున్నవని కలదు. ఐనను యీ పదునెనిమిదవ మంత్రమునకు ప్రాచీనత్వమున్నది గాన దీనిని

గ్రహించితిమనుకొనుము. ఇందు అగ్ని ప్రార్థింపబడుచున్నాడు. ఓ అగ్ని హోత్రుడా! మంచిమార్గముతో నన్ను ధనముకొరకు నడిపింపుము అని యున్నది. ఈమంత్రమును లోకసాధారణముగ గ్రహింపుదము. ఇందు గ్రహింపబడిన అగ్నిశబ్దమునకు లౌకికాగ్ని యని యర్థము కానేరదు. ఈయుపనిషత్తునందెచ్చటను అగ్నిశబ్దము ప్రయోగింపబడలేదు. కావున యీఅగ్ని శబ్దమునకు ప్రత్యేకార్థమును చెప్పవలయును. వేదమంత్రము లను వ్యాఖ్యానించునపుడు అభ్యాయుమూర్ధ్వగ్రత్యాది పదములకు ఎట్లు ప్రత్యేక పారిభాషికసంజ్ఞలతో నర్థములు ఆచార్యులచే స్వీకరింపబడెనో అట్లే యీ అగ్నిశబ్దమునకు పరిభాషార్థమునే స్వీకరింపవలయును. పూర్వోత్తరసందర్భములనాలోచించి పరిభాషకల్పింపదగును. ఈమంత్ర మునకు పూర్వమంత్రమునందు 'క్రతు' శబ్ద ప్రసక్తికలిగెను. క్రతువునకు అంగభూతముగు అగ్ని యిందు గ్రహింపబడెను. కావున అగ్ని యనగా 'కర్మ కరణము' అని యర్థము చెప్పకొనవలయును. మరియును వైదికకర్మముల యందు 'అగ్నౌకరణ' మని యొకనియమము గలదు. హోమకర్మము నారంభించుటకు అగ్నౌకరణము ముఖ్యము కావున అగ్నికి కరణమని యర్థము. కరణవ్యాపారాధిష్ఠానదేవతగ అగ్ని సంబోధింపబడినను కరణమే ప్రధానార్థము. ఓఅగ్నీ! ఓసాధనమా! న్యాయ్యమగు మార్గముతో యేమార్గము ననుసరించి పోయిన తనకుగాని పరులకుగాని హాని సంభవింపనేరదో అట్టి మంచిమార్గముతో ధనము కొఱకు నడిపింపుము అని యున్నది. ధనముకొరకనగా కేవలస్వార్థమైన ధనము కొరకని యర్థము గాదు. ఈ యుపనిషత్ప్రారంభమునందు జగచ్ఛబ్దమువాడబడెను కావున జగదభ్యుదయము కొరకనియర్థము చెప్పవలయును. మరియును "రాయే" అను పదము సంబంధార్థపద రహితముగ నుపయుక్తమయ్యెను. ఎవనియొక్క ధనము కొరకని ఆకాంక్ష పుట్టకమానదు. ఉదారచరిత్రులకు యీవిశ్వమే కుటుంబము. కావున

[illegible]త్రికముగనైన విశ్వకళ్యాణముకొరకు అను నర్థమే వచ్చును. అట్టి దాని కొరకే మమ్ము నడిపింపుము అని ప్రార్థనము చేయబడుచున్నది. ఇం దుపయోగింపబడిన "అస్మాన్" అను శబ్దము సకలమానవుల నుద్దేశించి ప్రయోగింపబడినది. గీతలయందును కర్మనిర్వహణ విషయము చక్కగ నుపన్యసింపబడెను. స్వభావనియతమైన కర్మమును చేయుము. స్వధర్మమును విడువకుము. లోకసంగ్రహముగ నిర్వర్తింపుము. ఈ మున్నగు బోధములకెల్ల బీజభూతమైనది యీమంత్రము. ఇక రెండవ వాక్యమునందు పూర్వోక్తకరణాధిష్ఠానదేవతాగ్నిని పొగడుచున్నాడు. ఓఅగ్నీ! సకలకర్మములను నీవెరుగుదువు అని యనుచున్నాడు. అనగా యేసాధనసంపత్తిచేత సకలకర్మజాలమునకు సమగ్రత సాధింపబడునో ఆవిషయమును నీవెరుంగుదువు. ఇట్లనుటవలన కర్మశుద్ధియు కరణశుద్ధియు కర్మకరణభావనాశుద్ధియు చక్కగ బోధింపబడెను. మరియు మానుండి వక్రభూతమైన పాపమును తొలగింపుము అని యున్నది. ఎన్ని శుద్ధులున్నను కర్మకరణము పాపస్ఫురణము కాకమానదు. గీతలయందును "సర్వారంభములు పాపముచే నావరింపబడినవని చెప్పబడియున్నది. అట్టి పాపమును తొలగించుట కుపాయము కర్మఫలత్యాగపూర్వక కరణమే యని స్పష్టముగ నిర్ణయించియున్నాడు. ఈ యుపనిషత్తునందును కూడ "నకర్మ లిప్యతేనరే" అని కర్మలేపాభావము సూచింపబడియున్నది. ఆ కర్మలేపాభావమే యిం దుపసంహరింపబడుచున్నది. ఇంతవరకు చెప్పబడిన వాక్యములు ప్రకరణసమాప్తి యనంతరము చెప్పవలసిన స్వస్తివాక్యముల వంటివి. కట్టకడపటి వాక్య మింకొకటి కలదు. ఈ వాక్యము సకల వేదాంతసారభూతము. ఈ వాక్యము ప్రస్థానత్రయపరమ తాత్పర్యనిరూపకము. ఈవాక్యము కేవలనైర్గుణ్య నైష్కర్మ్యసిద్ధిప్రదము. ఆ వాక్యమిట్లున్నది. "భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ" ఈవాక్యమే పరమమంత్రము. గీతలయందు కట్టకడపట "సర్వ

ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అని యెట్లు చెప్పబడెనో అట్లే యిందును చెప్పబడెను. తర్కవితర్కము లెన్ని నేర్చినను విజ్ఞాన మెంత యున్నను సకలశాస్త్రపారంగతుడైనను సర్వలోకాధారుడైన భగవంతుని, తల్లీలలను, తద్విశేషములను, కార్యకారణకల్పనా పాండిత్యముతో సమన్వయించుకొనలేని జనులే లోకులెల్ల నని కట్టకడపట శరణాగతి వాక్యమును చెప్పుచున్నాడు. "హే భగవంతా! వాచకశక్తి యావత్పర్యంతము నాయందు దున్నదో తావత్పర్యంతము ఆ వాచకశక్తి నెల్ల నమస్తే నమస్తే నమస్తే నమస్తే అను వాక్యములయందే యుపయోగింపబడుగాక" అని స్పష్టముగ బోధించుచున్నాడు. ఉపసంహారమునందు దివ్యమంగళ ప్రాయమైన యీ వాక్యమునకు "పరిచర్యలను చేయలేను; నమస్కారములను మాత్రము చేయుదును" అని యింకేదేదియో వ్రాసిరి. స్పష్టముగ నిందు భూయిష్ఠమగు నమస్కారోక్తి యునియున్నది. కావున "ఓమ్ నమో భగవతే వాసుదేవాయ" అను మంత్రము గూఢముగ నుపదిష్టమై యున్నది. వాసుదేవపరబ్రహ్మము కొరకు నమస్కారము. గీతలయందును "నమస్యంతః కీర్తయంతః" అని స్పష్టముగ నున్నది. కావున యిందలి నమస్కారోక్తి కేవలోక్తిమాత్రమున గాక ముద్రారూపమైన నమస్కారమును గావింపవలయునని యర్థము. అనగా రెండు అరచేతులను జోడించి తామరమొగ్గ ఆకారముతో ముద్ర గావించి ఆముద్రను వక్షోభాగమునందుంచి పద్మకోశప్రతీకాశమై దేహాంతరమున నున్న ఆహృదయము, ఆహృదయాంతస్థితదహరాకాశము, ఆదహరాకాశవిరాజమాన ప్రకాశరూపము సర్వము నీకిదే సమర్పితము" అనెడు బ్రహ్మార్పణబుద్ధి చక్కగ పర్యవసానమునందు బోధించుచున్నాడు.

ఓమ్ తత్సత్ బ్రహ్మార్పణమస్తు

ఓమ్ పూర్ణమదః

ఇతి శాంతిః.

---

ఓమ్ నమో భగవతే వాసుదేవాయ

# మాండూక్యోపనిషత్తు

## శాంతిమంత్రము

ఓమ్. భద్రం కర్ణేభిశ్శృణుయామదేవాః
భద్రంపశ్యే మాక్షభిర్యజత్రాః
స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః
వ్యశేమదేవహితంయదాయుః
ఓమ్ శాంతిశ్శాంతి శ్శాంతిః॥

తా॥ ఈశాంతిమంత్రము కేవలమాథర్వణికముగ గ్రహింపబడ కున్నను శిష్టసంప్రదాయమునందిదియే పఠింపబడుచున్నది. "హేదేవాః! భద్రంశ్రుణుయామ" ఓదేవతలారా! భద్రమైనదానిని విందుముగాక! అని యర్థము. యజత్రములైన అక్షములతో భద్రమైనదానిని చూతుముగాక! అని మరియొక వాక్యముగలదు. స్థిరములైన అంగములతోను శరీరములతోను స్తోత్రముచేయువారమై మాఆయున్సంతయు దేవహితమగునట్లు చేయుదుముగాక! అనునది మరియొకవాక్యము. ఈ శాంతి మంత్రమునందు శ్రవణదర్శనస్తోత్రములుగలవు. మొదట శ్రవణకార్యము నకు ప్రాధాన్యమిచ్చెను గావున శబ్దము, తదర్థము, తదుపాసనము మున్నగువిషయము లీయుపనిషత్తునందు ప్రసక్తములు. భద్రదర్శనము కూడ చెప్పబడినది కావున కేవలభగవత్సాక్షాత్కారమునకును నిందు ఉపాయముగలదని తోచుచున్నది. అంగములతో శరీరములతో స్తోత్రముచేయుట అనగా త్రికరణశుద్ధిగలిగి కేవలభగదర్పితముగ శరీరవర్తన పర్యంతము వర్తింపవలసియుండుట ద్యోతకమగుచున్నది. "స్థిరములగు

అని యనుకొనుటగాదు. నేను బ్రహ్మమును సర్వమును తదేకనిష్ఠ నుని
అనుకొనుట యద్వైతము. త్రిగుణమయము ప్రకృతి యనియు సర్వము
పంచభూతాత్మకమనియు సర్వమణుమయమనియు నెట్లు నిర్ణయించుకొను
చున్నామో అట్లే సర్వము భగవన్మయమని యనుభవించుకొనవలయును.
శ్రు॥ "యత్రహిద్వైతమివభవతి" అను వాక్యమువలన ద్వైతమంతయు
మిథ్యయందురు. కాని "ద్వైతంఇవ" అనియుండుటంబట్టి రెండింటి
యొక్క సమలక్షణములను నిర్ణయించుట తప్పని యర్థమగుచున్నది.
ఎట్లు భగవదస్తిత్వమో యట్లే తదితరమున కస్తిత్వమున్నది. అని
యనుకొనుటతప్పు. ఒకదానియొక్క అస్తిత్వనిర్ణయమే అద్వైతము.
ఆ సద్విలక్షణ మగునదేదియునుండనేరదు ఆ సద్వస్తు ప్రభావము వలన
నొకప్పుడు ద్వైతమా? యద్వైతమా యను సందేహము కలుగవచ్చు
ననియు సిద్ధాంతము సద్వైతమేయనియు తెలుపుటకే "ద్వైతమివ" అని
చెప్పబడెను. అట్లే "అన్యదివ" అని వేరొకచో చెప్పబడెను. ఈ "అన్య
దివ" శ్రుతియందును ప్రత్యేకాన్య దర్శనము భావనము మున్నగునవి
కూడనివని యుపదేశింపబడుచున్నది "అన్యః అన్యత్ పశ్యేత్"
అని శ్రుతివాక్యము గలదు ఈ వాక్యమునకు అర్థము 'అన్యుడు అన్యమును
చూచును' అని యర్థము. తాను తనకన్యమగుదానిని చూచునని యర్థము
గాదు "అన్యః భగవన్నిరపేక్షస్సన్ స్వయంస్థితః, అన్యః అన్యత్ భగవ
న్నిరపేక్షం సదితి పశ్యేత్" అని సంస్కృతమున వ్యాఖ్యానము
జెప్పవచ్చును. అన్యుడనగా ద్రష్ట. ఈ ద్రష్టృత్వాది లక్షణసంపన్నుడై
భగవన్నిరపేక్షముగ తానున్నానని యనుకొనెడివాడు అన్యుడని పిలువ
బడును. ఒకడు వేరొకదానిని చూచుచున్నాడు అనగా వేరొకదాని
యందు తనధర్మములలో నేదైనను లేకుండినయెడల జూడలేడు
కావున తనధర్మముయొక్క వికాస ప్రకాశనముల నెరుంగు
చున్నాడని "చూచుచున్నాడు" అనుదాని కర్థమగును. కావుననే

ఉపాసనార్హ మగునది ఆత్మయే యగునుగాని యనాత్మ కానేరదు. ఒకయుపాసకుడు తరుగుల్మలతాదులను ఉపాసించినచో తరుగుల్మలతాది మాత్రమే యవగాహనము చేసికొన్నవాడగునుగాని భగవత్సాక్షాత్కారము నొందలేడు. గీతలయందుకు స్పష్టముగ, "యే యథా మాం ప్రపద్యంతే తాం తథైవ భజామ్యహం, (గీత4-11)" ఎవ్వరెట్లు భావించిన వారికట్లు భావ్యుడనగుదునని చెప్పియున్నాడు. అట్టి యుపాసనములు బహుదూర కారణములు. సర్వము భగవన్మయమే యగుటవలన నెట్టియుపాసనము పరంపరాసాధనముగ గ్రహింపబడదగియున్నను సత్యాంత ప్రధాన ప్రశస్త సన్నిహిత సత్సాధనమునే యుపనిషత్తులు చెప్పినవి అగుటవలన కేవలప్రణవమునే భగవద్వాచకముగ గ్రహింపవలసినవి అయ్యెను. అది యట్లుండనిండు. అన్యత్ర అయి అన్యమును చూచెడు సౌభాగ్యము లేక తత్పరణ్యుడై తన్మాత్రమును చూచువాడు కావలయునని శ్రుతి యుపదేశించుచున్నది. రసానుభూతి యట్లేయుండును. సర్వసాధారణముగ శాస్త్రీయమనోహరమృదంగధ్వని శ్రోతయగువాడు ప్రారంభమున మృదంగశబ్దగుణ గ్రాహకేంద్రియవంతుడై (మృదంగనిష్ఠాన్యతనుధర్మవంతుడు) మృదంగధ్వనులను వినును. అప్పుడు శ్రోత శ్రవణము శ్రావ్యము అనుమూడుభాగముల ప్రత్యేకతతోనున్నను క్రమముగ నేను శ్రోతను అది శ్రావ్యము శ్రవణవ్యాపారము సంధానమగుచున్నది యనెడు ఖండజ్ఞానము లేక యఖండజ్ఞానసంపన్నుడై నాదమయుడై నాదమాత్రుడగుట యందర యనుభవమునందున్నదే కదా! ఈరసానుభూతి ఐంద్రికమగుటచే తాత్కాలికమైపోయెను. భాగవతమగునెడల శాశ్వతమగును. విజ్ఞులకింతకుమించి చెప్పనక్కరలేదు. అన్యుడన్యమునుచూచును. అను శ్రుతి వాక్యమునకు తాత్పర్యమిది. "యత్రత్వస్యసర్వమాత్మైవాభూత్ కేన కంపశ్యేత్కేన కం విజానీయాత్." ఈశ్రుతి నాధారముచేసుకొని ఎవ్వనిని చూడడు ఎవ్వనిని తెలిసికొనడు అనెడు అభిప్రాయమిచ్చుచున్నారు.

"తెలిసికొనడు, చూడడు"యని అజ్ఞానాంధత్వములతో సమన్వయించుట కంటె, "తెలిసికొనును, చూచును" అని అన్వయించుటలెస్స. ఈశ్రుతి యందు "యత్ర" అనుశబ్దముగలదు 'ఎచ్చోటను' అనియర్థము అనగా ఆ పరమమైనధామము అట్టిదని చెప్పుచున్నాడు. ఏస్థానముపరమాత్మయే యగునో ఆస్థానమున దేనితో దేనిని చూచును? దేనిలో దేనినెరుగును? అనిప్రశ్నించుచున్నట్లున్నది. దీనినే యాత్మసాక్షాత్కారమందురు. తన్నుతనతో తానుచూచును ఎరుగును అనియర్థము. లోకమునందును తన్ను తెలిసికొనవలయునని చెప్పుకొనుటకలదు. బ్రహ్మానందానుభవము విషయ విషయి ద్వైధీభావముతో నుండనేరదని నిరూపించుటకీశ్రుతి చెప్పబడెను. "అన్యుడు అన్యమునుచూచును" అనుదాని వ్యాఖ్యానమే యీశ్రుతియందు గలదు "కేన కం పశ్యేత్?" అనగా "న కేనాపి కమపి పశ్యతి" అని యర్థముగాదు. "ఆత్మనా ఆత్మా ఆత్మానంపశ్యతి" అని యర్థము. ఆత్మావలోకనము నందలి యసాధారణ దివ్యానుభూతి యట్టిది. ఇట్లన్వయింపకున్న శాస్త్రోచ్ఛేదమగును. "సోఽకామయత" అను శ్రుతివాక్యమును తీసికొనుడు. "వాడుకోరెను" అనియర్థము. ఏకాముకుడు ఏకామ్యమును కామించెను? అని పూర్వపక్షముచేసి "సఃన అకామయత" అనునర్థము చెప్పవలసివచ్చును. అది వేదరహస్యముగాదు. మఱియును "దేవదత్తుడు ఘటమును చూచును" అనువాక్యమునకుగల యర్థబోధము నరయుదము. దేవదత్తుడెట్లు పాంచ భౌతికుడో ఘటము నట్లే పాంచభౌతికము. దేవదత్తుడెట్లురూపవంతుడో ఘటము నట్లె రూపవంతము. రూపియైన దేవదత్తుడు రూపియైన ఘటమును రూప వ్యాపారముగ నెరుగుచున్నాడని యర్థము. "రూపవాన్ దేవదత్తః రూపవంతంఘటం రూపలయగత మకరోత్" అని సంస్కృతవాక్యము. అనగా దేవదత్తాన్యతమాంశము ఘటాన్యతమాంశముతో సాయుజ్య

వ్యాఖ్యానమును జేయుటయే దేవదత్తుని ఘటమును జూచుట అని యర్థము. కావుననే యీ మంత్రమునందు సర్వమైన ఓంకారము నుపాస్యముగ నుపాసన కుపదేశించుచున్నాడు. ఈ మంత్రము వాక్య వ్యాఖ్యానములతో నున్నదానినిగ గ్రహించక పోవుటవలన చిరకాలము నుండియు నపార్థములకు పాల్పడెను. ఈ మంత్రమునందలి వాక్యమిది. "ఓ మిత్యేత దక్షరమిదగ్ం సర్వం" - "ఓమ్ అను యీ అక్షరము యీ సర్వము." అని అర్థము. ఈ సర్వమును, నీ యుపదేశింప బడిన ఓంకారమని నిర్దేశించి నిర్ణయించుచున్నాడు. నామమును రూపమును సమన్వయించుచున్నాడు. ఇందలి రూపశబ్దమునకు కేవల చాక్షుష ప్రవృత్తి గల రూపమని యర్థముగాదు. నిరూప్య నిరూపక భావసంబంధముగల ఎల్లదియు రూపమని గ్రహింపవలయును. తార్కికముగ నవ ద్రవ్యములును రూపవాచ్యములగును. ఆరూపము నామమునందు లయింపజేసి తన్నామము నుపదేశించుచున్నాడు. "ఓమిత్యుపనిషత్" అని శ్రుతులయందును, "తస్య వాచకః ప్రణవః" అని యోగశాస్త్రము నందును స్పష్టముగ వచింపబడి యున్నది. ఓంకారమునే ఏల గ్రహించిరో యింతవరకును నెవ్వరును శాస్త్రీయముగ నిర్వచింపలేదు. ఓంకారమును గాక హ్రీంకారమునో మఱివేరొకదానినో గ్రహింపగూడదా? యనెడు శంకల కుత్తరము ప్రత్యేకముగ మా ప్రణవోపాసనము అనెడు గ్రంథమున జూతురుగాక. ఈ ప్రణవము భగవన్నిరూపణమునందు సర్వాతిశయము, నత్యంతసన్నిహితము—ఉపదేశమింతటితో పూర్తిగావించెను. ఇంక ఉపాసకునకు సమన్వయమగునట్లు ఆ యోంకారమును నంశములుగ విభాగించి వ్యాఖ్యానించుచున్నాడు. ఈ వ్యాఖ్యానము ప్రణవ వ్యాఖ్యానముగాక ప్రణవాన్వయవ్యాఖ్యాన మని తెలిసికొనుడు. ప్రణవమును వ్యాఖ్యానింపలేదు. ప్రణవవ్యాఖ్యాన మున్నప్పటికి గురుపరంపరలో సువిదితమైయుండెను. కావున అన్వయ వ్యాఖ్యా

నము చేయుచున్నాడు. ప్రణవమును నాత్మకెట్లు పట్టించి వ్యాఖ్యా
నించుటయో దానిని మాత్రమే చెప్పుచున్నాడు. కాని భూత
సృష్టియు ప్రకృతి విలసనమును మున్నగు నానాత్వ విరాజమానములగు
వానిని ప్రణవముతో నన్వయింపజేయలేదు. అకారము ఋగ్వేదమనియు
ఉకారము యజుర్వేదమనియు, మకారము సామవేదమనియు — అకార
మాకాశమనియు, ఉకారము వాయువనియు, మకారమగ్నియనియు
నిదియె త్రివృత్కరణమనియు, నిట్లే, వ్యాహృతి త్రయము (భూః, భువః
సువః) గుణత్రయము మొదలగువానితో నన్వయింపజేసి వ్యాఖ్యానింప
లేదు. అది యప్రసక్తము. కొందరనుకొనినట్లు (అకార, ఉకార, మకార
ముల) సంయోగ మోంకారముగాదు. ఈ ఓంకార మొక వాక్యస్ఫోటము.
అదియట్లుండనిండు. ఇక వ్యాఖ్యాన విధము: "తస్యోపవ్యాఖ్యానమ్.
భూతంభవద్భవిష్యత్ ఇతి." ఆ ప్రణవమును భూతభవిష్యద్వర్తమాన
కాలములనుగూడ ననుసంధింపవచ్చునని చెప్పుచున్నాడు. సర్వశబ్ద
ముచే సాధారణముగ దేశపాత్రములె గ్రహింపబడుటకలదు కావున
కాలమునుగూడ గ్రహించెను. ఇట్టి దేశకాలపాత్ర త్రిపుటియందుండ
దగిన యెల్లవిషయమును సర్వశబ్దవాచ్యము కాగలదు. అనుభవము
నందు కాలాదులు ప్రత్యేకాస్తిత్వయుతములుండిన యట్లున్నవి. కాలము
వికాసకారణముగను దేశము సంకోచకారణముగను, పాత్రము నివాస
కారణముగనునుండిన యట్లు కార్యకారణసంబంధబంధము భావనమునకు
పుట్టినను పరమార్థమున కేవలోంకారమే యని చెప్పుచున్నాడు. ఈ
వాక్యమునందు, "తస్యోపవ్యాఖ్యానమ్" అని గలదు. ఇందలి ఉపవ్యా
ఖ్యాన శబ్దమునకు ఉపలక్షణముగ చెప్పదగిన వ్యాఖ్యానమని యర్థము.
ఒక నాదమును స్వీకరించి దానినే కాలముగ నిరూపించుచున్నాడు. ప్రపం
చమునందు విషయముగ మన మనునదియెల్ల విషయమే అని నిరూపించు
టకు నాదకాలైక్యము నిర్వచించెను. సత్యముగ దేశకాల పాత్రములు

తావన్మాత్రములేయనియు తాత్త్వికములేయనియు ననుకొనుటయే గాని తాత్త్వికములుగావు. ఇక తాత్త్వికమగునది యేదియో యొక్కటియై యుండవలయును. ఆ యొక్కటియే బ్రహ్మమనియు ప్రణవమనియు పిలువబడుచున్నది. ఇంతియేల? సకలవ్యవహారమును తదేక వస్తూపలక్షకమైయుండును. కావున భగవత్సమానమని తలచుట మిథ్యయనియు, మాయయనియు, అవిద్యయనియు, నామకరణముచేసిరి. భగవదాభాసమని, భగవదుప వ్యాఖ్యానమని, భగవద్విలాసమని, నిశ్చయించు నప్పుడు కొంత సత్యతత్త్వమునకు సమీపించినవాడగును. దానికొరకే ఉపవ్యాఖ్యాసము కావలసివచ్చెను. మూడవవాక్యము, "సర్వమోంకార ఏవ" అనిగలదు. మొదటి వాక్యమునందున్న సర్వశబ్దమునే మూడవ వాక్యమునందును గ్రహించెను. కావున సర్వశబ్ద భావనోపసంహారమిందు గలదని తెలియబడుచున్నది. మరియొక మారు చెప్పుటవలన సర్వమను భావనకును ఏకమను భావనకును నైక్యము సంభవించునో దానిని చెప్పుటయే మంత్రోద్దేశమని స్పష్టమగుచున్నది. ఆ ఏకవస్తువును నాదరూపమున నిరూపించుచున్నాడు. నాదము నిరర్థకముగాక కేవలాకాశ గుణమాత్రముగాక సర్వభావనాతీత సుందరభావార్థకమని సరహస్యముగ నుపదేశించుచున్నాడు. అకారాదులెట్లక్షరములో యీ ప్రణవమట్లక్షరముగాదని చెప్పుచు యీ ప్రణవమునకు సర్వమనియు సర్వదేశకాలవస్తుజాతమనియు, సర్వదేశకాల వస్తు సమతీతమనియు, బోధించుచున్నాడు. యోగశాస్త్రమునందును ప్రణవమునకర్థభావనము కలదని చెప్పబడెను. నాల్గవవాక్యము "యచ్చాన్యత్త్రికాలాతీతమ్ తదప్యోంకారఏవ" అని కలదు. ఈ వాక్యమునందును కాలమును, కాలమును మించినదియును ఓంకారమేయని చెప్పబడినది. ఈ మంత్రమంతయును నాల్గు వాక్యములతో నున్నది. ఆ నాల్గు వాక్యములును మూడువిషయములను చెప్పుచున్నవి. సర్వమును కాలమును కాలాతీతమును ఓంకారమే అని సిద్ధాంతించెను.

ఇందలి 'ఏవ' కారము మరి యేశబ్దములకును వ్యాపింపక కేవల మోంకారమున నే సమన్వయింపవలయునని నిర్దేశించుచున్నది. త్రికాలాతీతము, దిగ్భావనాతీతము, ఇదవాస్తవము అనినిర్ణయించెడు వాస్తవభావనము నకును మించినది యగునది ఓంకారమని చెప్పుచున్నాడు. ఇట్లుచెప్పుట వలన బ్రహ్మసత్యమనియు, జగత్తుమిథ్యయనియు, నేనేబ్రహ్మమననియు అభిధానాభిధేయములకు భేదములేదనియు, నిదియభేదాద్వైతమనియు, నిర్వచించుకొనుచున్నారు. సత్యమదిగాదు. బ్రహ్మన్యముగ దేనికిని స్థితి లేదని యర్థము. నిరణుకముగ నే వస్తువులేనియట్లు, నిరంశముగ నే అంశియు లేనియట్లు, నిరక్షరముగ నే పదములేనియట్లు బ్రహ్మన్యముగ నేదియులేదు. తావన్మాత్రమున నేనేబ్రహ్మమను అనియనుకొనుట సమన్వయ మగునా? నేను బ్రహ్మధారమున నున్నవాడనని యర్థము.

## ౨. మంత్రము

సర్వగ్గ్ హ్యేతద్బ్రహ్మ య మాత్మా
బ్రహ్మసోఽయమాత్మా చతుష్పాత్॥

తా॥ ఈమంత్రమునందు "ఏతత్ సర్వంబ్రహ్మ" అనియు "అయ మాత్మాబ్రహ్మ" అనియు "సోఽయమాత్మా చతుష్పాత్" అనియు మూడు వాక్యములు గలవు. ఈమూడు వాక్యములకు పరమతాత్పర్య మేమనగా ఓంకారమే సర్వమనియు సర్వమే బ్రహ్మయనియు, బ్రహ్మమే ఆత్మయనియు, ఆత్మచతుష్పాత్తనియు చెప్పుచున్నది. ఓంకారము నకును ఆత్మకునుగల అన్యోన్య సంబంధమును ఉపవ్యాఖ్యాన రూపమున చెప్పుటకు మొదలిడుచున్నది. ఈ మంత్రములోని రెండవ వాక్యమే

మహావాక్యముగ పెద్దలచే గ్రహింపబడెను. ఆత్మార్పణముగ వాక్య మన్వయింపబడుచున్నది. గావున మహావాక్యమని చెప్పబడుచున్నది. మరియును బ్రహ్మమని వ్యవహరించు శబ్దమునకు చక్కని వ్యాపకార్థము నిందు నిరూపించుచున్నది. వ్యాప్యవ్యాపక, కార్య కారణక, జన్యజనక, జీవాత్మ పరమాత్మ, భావప్రవాహమునకు బ్రహ్మమని యర్థము. భగవ త్తత్త్వము బ్రహ్మము. బ్రహ్మతత్త్వము భాగవతము. సూర్యుడు భగవంతుడు, సూర్యత్వమైన కాంతాద్యాదికము బ్రహ్మము. తేజస్వి భగ వంతుడు. తేజస్సు బ్రహ్మము. అర్థము భగవంతుడు. శబ్దము బ్రహ్మము. ఏకము భగవంతుడు సర్వము బ్రహ్మము. కావున యీ మంత్రమునందు మహావాక్యసంపుటితో సర్వశబ్దమును నిర్వచించి, యానిర్వచన మాత్మ యందు ప్రతిష్ఠించి, ఆ ఆత్మోపవ్యాఖ్యానమును మొదలు పెట్టు చున్నాడు. ఉపనిషత్తులకు నాత్మతత్త్వ నిరూపణమే ముఖ్యముగాని అనాత్మవివరణముగాదు. అనాత్మతత్త్వ నిరూపణము సకలశాస్త్రములు చేయుచుండ ఆత్మతత్త్వ నిర్వాహణ ముపనిషత్తులు చేయును. కావున సర్వమాత్మవాచ్యముగ సమన్వయించుచున్నాడు. ఆత్మయందారోపింప బడిన చతుష్పాదత్వము ఎట్లు పరమార్థము కాదో ఓంకారమునం దారో పింపబడిన, అకారోకారాదులు పరమార్థములు గావు. ఈ మంత్రమునందు చెప్పబడిన క్రమములో కడపట ఆత్మశబ్దమున్నది కావున మొదటి మంత్రములో చెప్పబడిన ప్రణవమునకును యీ ఆత్మకును అవినాభావ సంబంధము కలుగుట వలననే ఆత్మపాదములను నుద్దేశించి ప్రణవోప దేశము చేయబడెను. ప్రణవమాత్రమే యుపాసనార్హమాయని శంకిం తము. ఓంకారము నుపాసింపవలయును అని యాదేశించుటయు, లోక మునందు గూడ సనాతనముగ ప్రణవ మాత్రోపాసకులు గలయట్లును విందుము. కాని గురుపరంపరల యాచారము నశించుటచే కొన్ని సంప్ర దాయము లడుగంటిన పనియును కొందును. ఇనను పూర్వసంప్రదాయముల

జాడలందందు గానవచ్చుచున్నవి. ధర్మార్థ కామసాధనా మాత్రులకు శ్రీకారము ప్రధానమైనట్లు సకలపురుషార్థసాధకులకు ఓంకారము ప్రధానము. కావుననే సకల శాస్త్రములును ఓంకారముతో ప్రారంభింప బడుట యాచారము. అక్షరాభ్యాసమునందును ఓంకారమును విడువ దగదు. కాని ఓంకారమును మాత్రమే యవలంబించి యూరకుండక 'ఓమ్ నమశ్శివాయ' అను పంచాక్షరీ మంత్రమును పాఠ్యముగ గావించు కొనిరి. అట్లే ప్రస్థానత్రయ పర్యాలోచనము సమరస సమన్వయము గావించుకొన్నచో కేవలమోంకారము ఉపాసనార్హముగాదని ఋజు వగుచున్నది. ఈ పరమ రహస్యము గీతలయందు నిగూఢముగ నున్నది. కావున నుపాసనార్హ మంత్రమును "ఓమిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరణ్" అను గీతావచనముంబట్టి "ఓమ్ నమోభగవతే వాసు దేవాయ" అనుమంత్రము సిద్ధమగుచున్నది. తైత్తిరీయమునందిట్లే యున్నది. మరియును జారిత్రకులు, వేదకాలమనియు, కృష్ణకాలమనియు, కాలవిభాగము గావించుకొన్నను సృష్టికాదినే యీవిద్య యుపదేశింప బడెనని గీతలయందుండుటవలన కాలకృతి ఖండ జార్యాఖ్యను పట్టదు. వశిష్ఠ విశ్వామిత్రాది ఋషులును ఈ మంత్రమునే నుపాసించియుండిరి. కావుననే బుద్ధియోగప్రధాన కర్మజాలము లెన్నియో, మేధాజననము నుండి ప్రారంభింపబడెను. ఇది నిశ్చయమే యగుచో స్పష్టాక్షరములలో నీయుపనిషత్తేల చెప్పలేదని శంకింతురేమో మంత్రము స్పష్టముగ, బహిరంగముగ, వైఖరీవాచకమున చెప్పుట యధర్మమని సనాతనాచా చారము. అది పరంపరాపరిపుష్టమై యుండవలయును. అట్టివెన్నియో నశించెను. సమాసస్వరములు, సాను నాసికాక్షరములు, మున్నగునవి నేటికి నశించెను. కావున స్పష్టాక్షరముల లేకున్నను పై మంత్రము గమ్య మానమని ఎఱుంగుటవలననే పెద్దలుద్ధరించి యాయాగ్రంథముల యందు వ్రాసిరి. అద్వైతులమని యనుకొనెడు కొందరు నమశ్శబ్దము నుపయో

గించుటలో బిడియ పడెదరు. ఆబిడియము దురహంకార ఫలము. అద్వైత స్థాపనాచార్యులనాదైన శ్రీ శంకరాచార్యులవారు ఈ మాండూక్యోపనిషద్వ్యాఖ్యాన ప్రారంభమునందు "యత్తన్నతోస్మి" అని బహుధా ప్రయోగించెను "సర్వ భావైర్నమస్యే" అనియును వాడెను. శ్రీ గౌడపాదాచార్యులవారును, "నమస్కుర్మః యథాబలమ్" అని నమన వ్యాపారము చూపించిరి. కావున బోడిగ "ఓమ్, ఓమ్" అనుట గాని "నారాయణ, నారాయణ" అనుటగానిమంత్రసంప్రదాయముగాదు. అద్వైతాచారమంతకంటెను గాదు. ఓంకారమునకును సర్వమునకును సమన్వయము మున్నే చెప్పబడియున్నను, యీ మంత్రమునందు యీ ఆత్మశబ్దము గ్రహించుటవలన ఆత్మవంతులెల్ల అధికారులని నిర్ణయింపుము మరియును ఆత్మయుండినచే అన్నియునుండుట సంభవించును. కావుననే ఆత్మగ్రహణము ముఖ్యమయ్యెను. ఇందుపయుక్తమైనఆత్మ, పరమాత్మ యనియు, పరబ్రహ్మమనియు ననుకొనుటతప్పు. అంతరూప విరాజమానమై, అనుభవైకగోచరమై యున్న 'యీ' ఆత్మబ్రహ్మము అని మహావాక్య ముపదేశించుచున్నది. ఈ ఆత్మయే బ్రహ్మజ్ఞానమునకు పరమసాధనము. ఈ గమ్యమానాత్మను నుద్దేశించి, ప్రత్యగాత్మను, గ్రహించుకొనుమని విచారమాత్రసాధనమున గాక యుపాసనామార్గమున నిశ్చయింపవలయునని యుపదేశించుచున్నది. విచారముగూడ వివేకపూర్వకాచరణమునకే అనియెరుంగుడు. ఆచరణరహితమై, అనుభవదూరమై అందదుకుల తొంగితర్కములచే కలుకులాడుట జ్ఞానము కాదు. "నాయమాత్మా ప్రవచనేనలభ్యః" ఇత్యాదిగ వేదమాతయే కరుణాఘనమై యుపదేశించుచున్నది. అట్టి యీయాత్మ నాల్గుపాదములు గలదనియెరుంగుడు. ఇందలిపాదశబ్దము చరణార్థముకాదు. విభాగాత్మకము. ఆ విభాగముకూడ, వేర్పరచదుస్థితిగల విభాగముకాదు. వివేకవిజ్ఞానలీలా మాత్రవిభాగము. ఒకరూపాయిని విభాగించినను, విభా

గింపకున్నను నూటతొంబదిరెండు భాగములుకలిగిన దానినిగ్రహింప గలిగినట్లింక నెన్ని యోవిభాగములు చేసికొనవలెగినను, తనకతెలియుండినట్లు, చతుష్పాద్రూపమై యాత్మయున్నదని శిష్యశిక్షకొరకు చెప్పుచున్నాడు. ఇంతటితో సూక్ష్మోపదేశమయ్యెను. ఇంక స్థూలముగ వివరించుచున్నాడు.

ఇ తి శి వ మ్

# ౩. మంత్రము

జాగరితస్థానో బహిష్ప్రజ్ఞస్సప్తాంగ ఏకోనవింశతి ముఖః,
స్థూలభుగ్వైశ్వానరః ప్రథమః పాదః ॥

తా॥ ఈ మంత్రమునందు ప్రథమపాదము వైశ్వానరుడనియు ఆవైశ్వానరుడు జాగ్రదవస్థాపన్నుడనియు, బహిష్ప్రజ్ఞుడనియు, సప్తాంగుడనియు, ఏకోనవింశతి ముఖుడనియు, స్థూలభోగి అనియు చెప్పబడెను. ఈవైశ్వానరుడే, విశ్వుడనియు, విరాట్టనియు, ననిపించుకొనుచున్నది. ఈ పాదము ప్రథమపాదము కావున వేదవేదాంగముల ప్రవృత్తియు, తన్నివృత్తియు, ఉపాసనాది సాధనములును, తత్సిద్ధియు, జ్ఞానావస్థయు, యీ పాదమునందే యనుభూతములు కావలయును. కావున దీనికి ప్రాథమ్యము సిద్ధించెను. ఇందలి జాగ్రదవస్థాపన్న పురుషుడు వైశ్వానరుడని పిలువబడుట వలన నిది, సకలమానవలోక కళ్యాణార్థము ప్రవర్తించినదని సూచనమగుచున్నది. (విశ్వశ్చ అసౌనరః విశ్వానరః=సకల మానవాః విశ్వనర ఏవవైశ్వనరః, వైశ్వానరః ఇతి) మరియును మానవ మనోవిద్యాబీజమిందుగలదు. ఆ జాగరితుడు, జాగ్రత్త అనెడు దశయే

స్థానముగ బలుకును. ప్రత్యేకస్థానము లేకున్న నాతనికి స్థితియుండదు కావున స్థానమును వర్ణించెను. ఇందలి స్థానశబ్దమునకు ఆయతనమని యర్థము చెప్పుచున్నారు. దీనికే గాక ఏస్థానమైనను అనాత్మకమే. ఆ యత నము జాగరితనామకము. జాగరితనామకస్థానమునందుండి బహిఃప్రజ్ఞుడగుచున్నాడు. స్వయముగ ప్రజ్ఞానఘనుడైనను బాహ్య జ్ఞేయములనెరింగి, జ్ఞాతృజ్ఞేయత్వరూపముతో నుండుట, బహిఃప్రజ్ఞుడగుట. విషయము విషయిభావము ఆత్మాధీనమై యుండును. ఏది విష యముకాగా అది విషయిభావమై యుండదు. 'తన్ను తానెరుంగుట' అసంభావ్యము వంటిది. ఆమాత్రముచే నద్వైతమని యభేదమని మిథ్యాత్వ వాదమునకు దిగరాదు. కాని తన ఛాయాప్రతిమ నవలోకించి విషయి విషయ భావలీలానందానుభవ మనుభవించుట అందరెరింగిన విషయమే. ఇట్టిదియే బహిఃప్రజ్ఞత్వము. బాహ్యవిషయ ములందు, ఎవడు ప్రజ్ఞకలవాడగునో వాడు బహిఃప్రజ్ఞుడని కొందరందురు. ఆయర్థము పొసగదు. ఆంతర్యమునందు ప్రజ్ఞారూపుడే యగుటంబట్టి, బహిఃప్రజ్ఞుడు కాదలచుచున్నాడు. జాగరితస్థానమున ఆత్మకు చక్కని సాధనముండును. నిద్రాళువైన యొకనిని వేరొకనూతన స్థానమునకు తీసుకొనిపోవ నతడు పూర్వాపరస్థానైక్యజ్ఞానసంపన్నుడు కానేరడు. జాగ రూకుడై యట్లుచేయబడిన భిన్నస్థానాభేదత్వమును నిరూపించుకొనగలిగి యుండును. అట్టిది బహిఃప్రజ్ఞత్వము. బాహిరమైనను ఆంతర్యమును భావించుకొనగలుగుట తనకుకలదు కావుననే బహిర్వ్యాపకమైన జ్ఞానము జాగరూకమగుచున్నది. అదియే ద్వితీయపాదమున నిరూపింపబడును.

ఈ వైశ్వానరునకు సప్తాంగుడని విశేషణము గలదు. ఇందలి అంగశబ్దమునకు తద్దశాసాధనమని యర్థము. అంగములేకున్న స్థానము నందుండుట సంభవింపదు. ఇంక ఆ ఏడంగములేవి? అనుటలో గొందరు ఆహవనీయాగ్న్యాదులును, ద్యుస్థానము మొదలగునవియును, వైశ్వా

పర విద్యకు సంబంధించిన గాథావిశేషములను గ్రహించి యన్వయించిరి. ఛాందోగ్యాదులయందలి వైశ్వానరవిద్య, యీ వైశ్వానరశబ్దముతో సంబంధము కలిగినట్లు తోచదు. శబ్దమాత్రసాజాత్యమేగాని ప్రశ్నా ముఖాదు లా కథలయందు వర్ణింపబడలేదు. కావున యీ విశ్వుని సప్తాంగములు వేరొకటి యైయుండవలయును. ఇందలి సంఖ్యావాచకమైన సప్తశబ్ద మిష్టమువచ్చినయట్లు వ్యాఖ్యానించుకొన్నను, విశ్వునకు సమన్వయించెనా లేదా, అనునదిచూడవలయును. ఈ ప్రపంచమునకు నండపిండ బ్రహ్మాండమయమైన దెల్ల సప్తసంఖ్యాకముగ వైదికులు గ్రహించిరి. అధర్వణవేదమునందు, "త్రిషప్తావిశ్వారూపాణి" అని కలదు. సకలవిశ్వమునకు సప్తమనియు, త్రిసప్తమనియు, పేరులుగలవు. కావుననే, సప్తలోకములు, సప్తర్షులు, సప్తవాయువులు, సప్తస్వరములు మున్నగు సప్తసంఖ్యాపరిగణనము పరిపాటియైయుండెను. మరియును ప్రత్యేకముగ యజుర్వేదమునందు "త్రిః సప్తః సమిధః" యీయజ్ఞ పురుషరూపమైన దీనిని సప్తనామముతో పిలిచిరి. ఆ సప్తావలంబనము కలవాడగుటంబట్టి జాగరూకుడు సప్తాంగుడయ్యెను. ఈజాగరూకు డేలోకమున నున్నను సప్తాంగుడే. అలోకదశయం దనంగుడై అసంగుడగును. ఇందలి సప్తశబ్దమునకు కేవల మేడనిదే యర్థముగాక నానాత్వమున కుప లక్షకమై యుండును. ఏకోనవింశతిముఖుడని వర్ణింపబడెను. పందొమ్మిది ముఖములుగలవని యర్థము. లౌకికముగ ద్విముఖ, చతుర్ముఖ, పంచ ముఖాదిశబ్దములవలె దీనికర్థము చెప్పరాదు. ఇందలి ముఖశబ్దము ముఖ్యార్థము. ఉత్తరవిశేషణమునందు భోగమున్నది. కావున భోగము నకు ముఖమాధారము. ముఖములేని భోగములేదు. అంగములేని స్థానములేదు. కావున భోగముఖ్యవిషయములు పందొమ్మిది అని యర్థము. ఆ పందొమ్మిది విషయము లేవియని, పాండిత్యముకొలది వితర్కింపనక్కరలేదు. కేవలచైతన్యాంశము లేవేవిగలవో యవియే ముఖ

ములు. దశేంద్రియములును, పంచవాయువులును, నాలుగంతః కరణములును కలిపి పందొమ్మిది ముఖములని పిలువబడును. కర్మకరణము సకర్తృకము. కర్త స్వతంత్రుడు; సచేతనుడు. అట్లగుటచే కర్మేంద్రియములు భోగముఖములు. అట్లే జ్ఞానేంద్రియములును భోగముఖములని సులువుగ గ్రహింతుము. పంచవాయువులు భోగముఖములెట్లని సందేహింపకుడు. ఆవాయువులుకూడ జాగ్రద్దశాపన్నుని భోగముఖములే. ఆవాయువులసత్తయందే దేవదత్తుడు దేవదత్తుడగుచున్నాడు. లేకుండిన శవమని పిలువబడును. అంతఃకరణములు భోగముఖములేకపో! ఇది యిట్లుండనిండు. వైశ్వానరుని తెలిసికొనుటకీముఖములే ముఖ్యలక్షణములు. మిగిలినవి వ్యక్తములైనను కాకున్నను లక్షింపదగినవికావు. ఒకజంతువును పోల్చవలయునన్న ముఖమే ముఖ్యము. తోక కడుపు కాళ్లు కనబడకున్నను, కనబడినయట్లే భావించి "అమ్మయ్యో పులి!" అని వ్యవహరింతుము. ఒకమానవు డే పేరివాడని తెలిసికొనుటకు ముఖమే ముఖ్యము. కరచరణాదులుగావు. వైశ్వానరుని తెలిసికొనుట కీ పందొమ్మిదిముఖములు ముఖ్యములు. కావుననే యీ ముఖములను సంస్కరించుటయందే యెల్లశాస్త్రములకు ప్రవృత్తి కలిగెను. అట్టి యీ ఆత్మపాదుడు స్థూలభోగి అని వర్ణింపబడెను. తన భోగమంతయును స్థూలీకరణమునం దున్నదని నిశ్చయించు స్వభావము కలవాడు. ఎంత సూక్ష్మీకరించినను స్థూలీకరింపకున్న సమగ్రానందము లేనివాడే. కావుననే నిర్గుణోపాసనమనర్హము. తైజసపాదునకు, తైజసపాదుడు నిర్గుణోపదేశము గావించిన కావింపవచ్చు గాని, విశ్వపాదుడగు వీనికి సగుణోపాసనమే కరణీయము. మరియును యీ వైశ్వానరుడు స్థూలభోగి యనుట నిశ్చయమగునెడల నీచర్మచక్షువులతో, నీజ్ఞానేంద్రియములతో ప్రజ్ఞానబ్రహ్మవాచ్య పరమదివ్యసాక్షాత్కారము పొందగలుగునని దృఢమగుచున్నది. అదియే స్థూలీకరణము.

స్థూలీకరణ మైనంతమాత్రమున సూక్ష్మాతిసూక్ష్మా నిర్వచనీయ నిరంజన నిర్గుణప్రభృతివిశేషణజ్ఞానముకలుగదని యనుట తప్పు. వేదవేదాంగములన్నియు జాగరూకోద్దిష్టము లగునెడల పరమార్థము గూడ జాగరూకగమ్యమే. ఇక నతివిస్తర మతి దుస్తరము.

ఇతిశివమ్ —

## ౪. మంత్రము

స్వప్నస్థానోఽన్తఃప్రజ్ఞః ఏకోనవింశతిముఖః
ప్రవివిక్తభుక్తైజసో ద్వితీయఃపాదః॥

తా॥ ఈమంత్రమునందు ద్వితీయపాదుడైన తైజసపురుషుడు వర్ణింపబడుచున్నాడు. బోధముకొరకు ప్రత్యేకపురుషునిగ తైజసుని గ్రహించినప్పటికి వైశ్వానరుడే తైజసుడని గ్రహింపవలయును. వైశ్వానర తైజసులభేదముస్థాన, ప్రజ్ఞా, భోగవిషయములందు మాత్రమే యున్నది. స్థానము స్వప్నము. ప్రజ్ఞ అంతఃప్రజ్ఞ. భోగము, ప్రవివిక్తభోగము. మిగిలిన అంగములును ముఖములును సమానములే. కొన్నింటసామ్యమును కొన్నింటవైషమ్యమును కలిగియుండుటయే భేదవాదము. కేవలభేదమైన వస్తువేదియునులేదు. తైజసపురుషుడెట్లు నిత్యము తైజసుడై యుండగూడదో తైజసుడొకప్పుడెట్లు వైశ్వానరుడు కావలసివచ్చునో యట్లే జీవుడు తనజీవలక్షణ త్యాగములనుచేసి పరమాత్మయందు లీనుడుగావలయును. జాగ్రద్దశాపన్నుడు స్వప్నదశాసంక్షోభమును ఎట్లు పాటింపడో యట్లే జీవుడుపాసకుడై తృప్తుడై త్యాగియై యానందియగును. జీవుడానందియగునప్పుడు జీవవ్యవహారముండదు. జీవప్రత్యేకలక్షణములుండదు. తత్త్వమట్లగునని జీవుడే దేవుడనరాదు. తైజసుడే వైశ్వా

నరుడైనను వైశ్వానర తైజసులకు భేదముకలదు. నేటివైశ్వానరుడు రేపటివైశ్వానరుడును నొక్కడై సమజ్ఞానక్రియేచ్ఛాశక్తివిశిష్టుడై యుండును. జ్ఞానాదిప్రవాహమున కుచ్ఛేదము కలుగదు. నిన్నటికార్యములు నేడును నేటికార్యములు రేపును సమముగ నిర్వహింపగలుగుచున్నాడు గాని తైజసు డశక్తుడు వైశ్వానర తైజసులభిన్నులైనను తైజసుడు వైశ్వానరుడు కావలయునుగదా! తైజసునివంటివాడు వైశ్వానరుడు కాడు. ఈ తైజసుడు 'అంతఃప్రజ్ఞు'డని వర్ణింపబడెను. లోకమునందెల్ల వస్తుజాతము ప్రతిజ్ఞాతమైయుండును. ప్రతిజ్ఞాతముకానిచో నీసృష్టి నిరర్థకమనియు సుప్రేరితమనియు నొకవిధమగు నకారణసంక్షోభమనియు ననవలసివచ్చును. సృష్టియందు క్రమముగు వికాసము, ప్రకాశనము, సృష్టిస్థితిలయక్రమము, మొదలగుధర్మవిశేషములు కానవచ్చుటచే సంక్షోభమని పిలువదగదు. సంక్షోభ మెయగు నెడల వేసవియనియు, వానకాలమనియు, చలియనియు నొకక్రమముండగూడదు. ఈక్రమతత్త్వము చక్కగసమన్వయించుకొనినయెడల త్రివిక్రమస్వరూపావగాహనమగును. ఆ తైజసపురుషుడు తానంతఃప్రజ్ఞుడనగా, క్రమతతో సంబంధములేక నన్నింటిని, సమ్మర్దముగ, సమూహముగ, సమవాయుగ, సంయోగించుకొనగలుగువాడని యర్థము. కాని వానివిభాగము మాత్రము వాని వశముగాదు. సంయోజకుడేగాని విభాజకుడుకాడు. సంయోజక వియోజక శక్తిసంపన్నుడు వైశ్వానరుడు, తైజసునకట్టిశక్తిలేదు. వేయేల నిర్గుణపరబ్రహ్మవాదుల మనుకొనెడు వారు ఇంచుమించు తైజసపురుషుని వంటివారు. తైజసు డంతఃప్రజ్ఞుడనగా నెరిగి బహిష్ప్రజ్ఞుడు కాలేడని యర్థము. ఇంక "ప్రవివిక్తభోగి" అంతఃప్రజ్ఞుడయ్యు అంతర్భోగిమాత్రము కానేరడు. సంస్కార రహితుడగుటచే ప్రవివిక్తముగ, నేకాంతముగ, జాగ్రదాది వాసనాబంధముగ అనుభవించువా డగును. తన ప్రవివిక్త భోగిత్వము వైశ్వానరుడై సంస్కరించుకొనవలయును. అట్లు సంస్క

లించు కొనకున్న భోగియగుటకు మాత్రము కోరి యగును. ప్రవివిక్తభోగి కావున నంతఃప్రజ్ఞత్వసాధనాశక్తి నుపయోగించి వైశ్వానరవేళయందు సంపాదింపబడ నేరని కామనాదులను ప్రతిష్ఠింపక వానినెల్ల సంక్షోభకారణములుగ గ్రహించి సంస్కరించు కొనవలయును, అట్టి సంస్కారమంతయు వేదాంత శాస్త్రములయందు వర్ణింప బడియున్నది. ఏకాంతభోగమునటవలన క్రమవివిక్తమగుచు నవశ్య మమై యస్వప్నస్వప్నమై యొకప్పుడు తైజసానుభవము కలుగును. ఒక సుందరవనితను వైశ్వానరుడు చూచెననుకొనుడు. మొదట ధార్మిక భావనములను గావించెననుకొనుడు. తైజసుడై యొకప్పుడా సుందరినే వివిక్తముగ నధార్మిక భావనాతృప్తి బొందినట్లును, నొకప్పుడు త ద్విలక్షణముగ భావనాతృప్తికి ప్రయత్నింప తానేవచ్చినట్లును, నంతలో చిరకాలపరిచితయైన తనసుందరియే ఆసుందరియైనట్లును వివిధవికారము లతో, వైశ్వానరానుకూలముగను వైశ్వానరప్రతికూలముగను పరిణ మించును. అదియే ప్రవివిక్తభోగలక్షణము. ఈ ప్రవివిక్తభోగియగుట వలన,జగత్తుమిథ్య, తానేదేవుడు వాస్తవమిదియేదియును గాదు. స్వప్నము వంటిదే యీజగము అనెడు నిర్ణయముల కాధారముగాను. వైశ్వా నరుడు తైజసుడెప్పుడగుచున్నాడో విజ్ఞులు కొంచెము వివేకింపుడు. వైశ్వానరోత్తరుడు తైజసుడేయైనను, ప్రాజ్ఞానంతరుడు తైజసుడుగ నను భవమునందున్నది. జాగ్రద్దశవిడిచి నిద్రాదశ పొందిన తరువాతనే స్వప్నదశవచ్చును. కావున, స్వప్నమునకు నిద్రయే భూమిక. నిద్రయే లేనియెడల స్వప్న మసంభవము. జాగ్రత్స్వప్నముల మధ్యమున నిద్ర యున్నది. ఈ మూడుదశలును సంపాదితములుకావు. స్వాభావసిద్ధ ములు. స్వాభావసిద్ధములగు వానినుండి, స్వరూపజ్ఞానమును సంపా దించు కొనవలయును. స్వరూప జ్ఞానసాధనము లీదశలు. ఈ దశ లాత్మనిష్ఠములు. కావున నాత్మతత్త్వ జ్ఞాన మిం దిమిడి

యున్నది. తైజసక్రమము జన్మాంతరాస్తిత్వమును బోధించుటకు సాధనమని యెరుంగుడు. జన్మాంతరసిద్ధాంతము భోగనిముక్త మని యార్యులందరెరింగిన విషయమే. భోగనిముక్తమే లేకున్న జన్మాంతరమే లేదు. "నాభుక్తం క్షీయతే కర్మ జన్మకోటిశతైరపి" అని అభియుక్తులందురు. జన్మకోటులు భోగముకొరకే. కనుకనే వేదాంతశాస్త్రము నందు భోగవిరాగము కావలయునని చెప్పబడినది. కావున స్వప్నదశ నాధారముచేసికొని జన్మాంతరము కలదని నిశ్చయించుకొనుడు. జన్మాంతర సిద్ధాంతస్థాపనాచార్యుడు తైజసుడు. తురీయానుభవ విరహిత ముగ (ధ్యానయోగ సమాధి విరహితముగ) ఎవ్వడు నిద్రాదశ నొందునో యట్టివాడు ప్రవివిక్తభోగియై యంతఃప్రజ్ఞుడై స్వప్నస్థానాది దుర్నివారస్థానములు పొందవలసినవాడగును. జాగ్రత్స్వప్నసుషుప్తులే దుర్నివారములు; తురీయము యత్నసాధ్యము. ప్రయత్నరహితులకు తురీయము సాధింపబడదు. కావుననే తురీయపాదము స్థానాదివిలక్షణ మై యున్నది. ఇక నిద్రాదశ మరణ సదృశమనియు స్వప్నదశ జన్మజన్మాంతర సదృశమనియు జాగ్రద్దశ వేద వేదాంతాది విజ్ఞాన వివేకితా సదృశమనియు, తురీయము ధ్యానసమాధి బుద్ధియోగాద సదృశ మనియు నిశ్చయింపుము. ఈనిశ్చయ మారోపమాత్రముగాదు. ఈనిశ్చ యమే యుపాధినిష్ఠమై యున్నది. సంప్రదాయమును సనాతనముగ నట్లే యున్నది. నిద్రకును చావునకును సాదృశ్య మున్నటు లందరెరుంగు దురు. మిగిలిన దశలు వేనితో సదృశములో వివేకింపకపోయిరి. ఇదియే స్వాత్మపరీక్ష.

# ౫. మంత్రము

**యత్రసుప్తో నకంచన కామం కామయతే నకంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తం సుషుప్తస్థానఏకీభూతః ప్రజ్ఞానఘనఏవా౽నంద మయోహ్యానందభుక్చేతో ముఖః ప్రాజ్ఞస్తృతీయః పాదః॥**

తా॥ ఈమంత్రమునందు తృతీయపాదమైన ప్రాజ్ఞుని వర్ణింప బడుచున్నాడు. ఈప్రాజ్ఞుడు సుషుప్తస్థానుడు అగుటబట్టి ఇతనికి అంగ ములను గూడ చెప్పవలసియుండెను. కాని ఒక్క అంగమును వర్ణింప బడలేదు. అంగములేకున్నను ముఖముమాత్ర ముమున్నది. స్థానము, అంగము, ముఖము; ఉండవలసిన యీ మూడింటిలో ఒకటి లేకపోయి నను యున్నట్లే గ్రహించుట సంప్రదాయము. ఏకీభూతః అను విశేష ణముబట్టి అనేకముగనుండునది యేదియో ఏకీభూతమైనదని చెప్పితీర వలయును. ప్రథమ ద్వితీయపాదములకు అనేకముగ నుండునవి అంగము లును, ముఖములును అయి యున్నవి. అందలి అంగములో ముఖములో ఏకీభూతమై యిందుండవలయును. ముఖము ప్రత్యేకముగ వర్ణింపబడెను గాన "ఏకీభూతః" అనగా "ఏకీభూతాఙ్గః" అని యర్థము చెప్పవలెను. ఈ తృతీయపాదుడు అండపిండ బ్రహ్మాండములం దేఁగుండినను నిట్లే యుండవలెను గావున ఏకీభూతుడని చెప్పుచున్నాడు. ప్రాజ్ఞుడను నప్పు డెట్లు సకల ప్రజ్ఞలు నిందు లయించి యుదయింపగలవని వ్యాఖ్యాతలను చున్నారో యట్లే వీనియందు సకలాంగములును లయించి ఏకరూప మున నుండి భిన్నరూపము నొందగలుగుట సంభవము గావున ఏకీ భూతవిశేషణము సార్థకము. అవిభాజకముగ, విభాగానర్హముగ నుండు నది యగునెడల ఏకమనియు తద్విలక్షణైక స్వరూపమున నేకీభూత

మనియు శబ్దవ్యవహారము. ఏకీభూత మనుటలో నానాత్వ వ్యవస్థగలదు. ఆ వ్యవస్థ అవ్యక్తము అవ్యాకృతము. అట్టి మూడవపాదుడు చేతోముఖు డని విశేషింప బడుటచే పూర్వము చెప్పబడిన పందొమ్మిది ముఖముల యర్థము న్యాయ్యమని ఋజు వగుచున్నది. చేతోముఖు డనునప్పుడు నిజముగ చతుర్ముఖుడని చెప్పవలెను. చేతోముఖుడనుటకంటె వాతో న్ముఖుడని పాఠముండిన బాగుగనుండు నేమో యని తార్కిక బుద్ధికి దోచకపోదు. సృష్ట్యాదిరూపుడైన పౌరాణిక బ్రహ్మయు ఆదియందు పంచముఖుడేకదా. సమన్వయము పట్టును కాని సమంజసముకాదు. శవమునకుగూడ వాతముఖత్వము సిద్ధింపవలసివచ్చుటచే ("మృతంవాపి నజహాతి ధనం జయోవాయుః") వాతముఖ పాఠవాదము దుర్వాదము. ఇంతకును మంత్రమున చేతోముఖమనియే యున్నది. కావున నంతఃకరణ ముఖుడని యర్థము. యోగశాస్త్రమునందును నభావప్రత్యయాలం బనము కలదు కావున ఆ యాలంబనము చిత్తాదివ్యాపారమే. అది ఆలంబనముగాని ఆకర్షణముగాదు. అంతఃకరణ సమవాయముఖు డగు టంబట్టి స్థూలసూక్ష్మ విభాగమక్కరలేక యానంద భుక్కగుచున్నాడు. ఇందలి ఆనందభుగ్విశేషణము వలన * బ్రహ్మానందానుభవము కలవాడని యర్థముచెప్పరాదు. కాని నిద్రావేళాను భూయమా నానందము, జాగ్రద్వేళా జ్ఞాతమేకాని నిద్రాజ్ఞాతముకాదుగదా! నేను సుఖముగ నిద్రించుచున్నాను, అను అనుభవము వర్తమానకాలమున ఎవ్వరికిని లేదుగదా! బ్రహ్మానందాను భవమట్టిదికాదు. ఐనను నిద్రయందే ద్వంద్వములును సుఖదుఃఖాదులును రాగద్వేషాదులును నభ్యాసవశ పూర్వకమునగాక కారణాంతరమున లేనివాడై యుండుటంబట్టియు, నేదియోయొక విధముగ భోగముకలవాడగుట, నాభోగమునకే పేరు

* ఆనందమయశబ్దమునందలి 'మయట్' ప్రత్యయమువలన ప్రాచుర్యార్థము చెప్పబడయును. ప్రాచుర్య మానందమైనను, క్వాచిత్క మానందేతర మున్నది. ఆక్వాచిత్కమే స్వప్నము జాగరణము మరణము.

తగునని ఎట్టివారు విచారించినను నానంద మనియే యనవలయును. విషాదమనరాదా, యని శంకించుట కవకాశములేదు. మహారోగరూప బాధావిషాద నివారణమునకీ నిద్రాదశ మహోపకారకము గదా! కావున విషాదముగాదు. విషాదమునకు వ్యతిరేకమానందమే. అత డానంద భుక్కనను ఆనందికాడు. మరియునానందమయుడు. ఇందలి యానందమయ రూపము రెండుపాదములకు విలక్షణమైనది. మిగిలిన రెండుపాదములలో ఆపురుషుల రూపములు లేవు. ఈపురుషుడుమాత్ర మానందమయుడు. ఆప్రథమద్వితీయ పురుషులకు సంక్షోభమో సంతోషమో దుర్నివారముగ సంభవింపక మానవు కాని ప్రాజ్ఞనకా ద్వంద్వప్రాప్తిలేదు; కావుననే ఆనందమయుడు. ఈఆనందమయ శబ్దమును వ్యాఖ్యానించిన శ్రీశంకరాచార్య దివ్యపాదయుగళికి నానమస్కారములు. కానిబ్రహ్మానందము నిద్రానంద సదృశముకాదునుడీ! ఈసుషుప్తస్థానుడు ప్రాజ్ఞుడని పిలువబడుటవలన ప్రజ్ఞావంతుడనియే అర్థము చెప్పవలయును. కాని కొందరనినయట్లు మూఢుడని యర్థముచెప్పరాదు. ప్రాజ్ఞ లక్షణములు కొన్ని యితనియందు పట్టియున్నవి ఆలక్షణముల నక్షరశః స్పష్టముగ చెప్పుచున్నాడు "నకంచనకామం కామయతే నకంచన స్వప్నంపశ్యతి" ఎట్టికామమును కామింపడనియు, ఎట్టికలనుగనడనియు, ప్రాజ్ఞముఖ్య లక్షణములనుగ చెప్పెను కాని తత్త్వముచే బ్రహ్మానందానుభవమట్టిదని యర్థముకాదు. కామించినను బంధకారణము కాకుండవలయును. ఆశక్తి యీప్రాజ్ఞునకు లేదు. వేదములయందు "సోఽకామయత" — వాడు కామించెను అనియున్నది. గీతలయందు ధర్మావిరుద్ధమగు కామమును నేను అని యున్నది కామరాజ్యస్థాపనము మా యుద్దేశ్యము కాదు. సాధారణులకీ కామము మహాశత్రువు. ఆ కామమే యీ మంత్రమునందలి కామము. కామింపడు, కలగనడు, ఈ రెండువాక్యములవలన, కామించెనేని కలగనును అను వేరొక వాక్యమును

గ్రహింపవలయును. నిద్రాభూమికా రహితమైన స్వప్నములేదుకదా! స్వప్నము జన్మతుల్యమని చెప్పితిమి. జన్మమునకు కామమే కారణము. కేవల సకామమైనను, కేవలనిష్కామమైనను జన్మహేతువని ఎరుంగుడు. ప్రాజ్ఞుడు తత్కాలమున కామవ్యాపారరహితుడు. అట్లే దర్శన శ్రవణాది వ్యాపారరహితుడని బోధించెను గాని యిదియొక రహస్యముకాదు. మున్నుచెప్పినయట్లు మరణమట్లుండునని, కావుననే మరణముతో అంతయు మట్టిగలియునని కొందరనుకొనుట సంభవించెను. అది తప్పని యుపదేశించుటకే యీ మంత్రమున వ్యాపారనిర్వ్యాపారస్థితుల ఏకీభూతిభావము నుపన్యసించుచున్నాడు. ఈ ప్రాజ్ఞుడే స్వప్నకారకుడు. అనగా జన్మకారణము. "జాతస్యహి ధ్రువో మృత్యుః ధృవం జన్మ మృతస్యచ. గీత (2 27)" అను పరమార్థమిం దిమిడియున్నది. ఇంత వరకును ప్రాజ్ఞవిషయమునుజెప్పి మూడుపాదముల నన్వయించి, తురీయపాదునకు యెట్టి సంబంధముగలదో ఆ తత్త్వము నుపదేశించుటకు ప్రతిజ్ఞావాక్య మారంభించుచున్నాడు.

## ౬. మంత్రము

ఏషసర్వేశ్వర ఏషసర్వజ్ఞ ఏషోఽంతర్యామ్యేషయోనిః
సర్వస్య ప్రభవాప్యయౌహిభూతానామ్॥

తా॥ ఈమంత్రము కొందరు ప్రాజ్ఞప్రశంసా వాదమని చెప్పు చున్నారు. ఈశ్రుతికి ప్రాజ్ఞప్రశంస కార్యము కాదు. ప్రాజ్ఞః పురుషసమన్వయము కార్యము. అట్లనుకున్న యుపక్రమ సంహారములు దగలకుండగును. మరియును ప్రాజ్ఞోద్దిష్టమీ మంత్రమగునెడల "ఏషసర్వజ్ఞః" అని ప్రత్యేకముగ విశేషింప పనిలేదు. సర్వజ్ఞవిశేషణముచే ప్రాజ్ఞుడుకాడని వాక్య

చెప్పవచ్చును. కావున యీమంత్రమునందలి 'ఏష' శబ్దము పూర్వవర్తి కన్వయింపక పురోవర్తి కన్వయింపవలయును. ఇతడు సర్వేశ్వరుడు. ఇతడు సర్వజ్ఞుడు. ఇతడు అంతర్యామి. ఇతడు సృష్టి స్థితి లయములకు మూల కారణుడు. అని వర్ణింపబడి యున్నది. పూర్వోక్తసిద్ధాళువో, పరోక్త భద్రాత్మయో బుద్ధిమంతులూహింపుడు ఈ మంత్రమునం దింత విపులముగ పాదచర్చగాని, మంత్రచర్చగాని, అర్థచర్చగాని అక్షరచర్చగాని, మాత్రాచర్చగాని లేక జ్ఞేయత్వప్రతిపాద్యవిషయమగు దివ్యజ్ఞాతృ జ్ఞాతృస్వరూప నిరూపణమున కలిగెడు నానందముతో పలికెడు ప్రతిజ్ఞావాక్యము మహితుల సంభాషణమునందే యుండును. ఇతడు సాధారణేశ్వరుడుగాక యలౌకికేశ్వరుడు గావున సర్వేశ్వరుడని పిలువబడుచున్నాడు. సర్వజ్ఞుడై, సర్వేశ్వరుడై యున్న యితడు సాధారణుల కందుబాటులో నుండడేమో యనెడు భ్రాంతిని నివారించుటకు యితడే అంతర్యామి యని చెప్పుచున్నాడు. అంతర్యామియైన యితనియొక్క ప్రయాణరూప ప్రస్థానము చక్కగ సాగించుటకు శాస్త్ర ప్రవృత్తి కలదు. అదియే ప్రస్థానత్రయము. అంతర్యామి విశేషణముచే కొందరు నీలోనున్నవాడు వాడేయని యనుచున్నారు. అది తప్పు. నీలో నున్నాడను భావనాశక్తి తదధీనమే అని యెరుంగుటయే. కార్యము. కావున లోనున్నవాడు సాధకుడుగాని సిద్ధుడుగాడు. సాధక సిద్ధసంయోగమే బుద్ధియోగము. ఇదే భూతములయొక్క సకలసృష్టి లయములకు కారణుడు అని తెలుటవలన, సృష్టిలయాదులు భూతములు యున్నగునసిరెల్ల, 'కార్యము' లనుట నిశ్చయముగదా! బోధముకొరకు కార్యకారణకల్పనము కావించుకొన్నను కార్యజ్ఞానము కారణమున లయింపవలయును. కావున జన్మకు ముఖ్యధర్మము యీ భగవద్రూపమునందు నిలీనమగుటయే యగును. ఒకవేళ భగవదుపాసకులయ్యు జననమరణరూపఘోర సంసారచక్ర భ్రమణము తప్పదేమో

యను భ్రాంతిగలవారికి నభయప్రదాన మిందుగలదు. సృష్ట్యాదికి తానే మూలకారణుడగుటచే నిబ్బరముగ నుండవచ్చును. సృష్టమైనను నష్టమైనను తనకేమియు భయములేదు. అతడు సర్వజ్ఞుడు సర్వేశ్వరుడుగదా! "అహంత్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి." అని యభయమీయలేదా? ఇక భయమేల? మనవర్తనము కుంటుపడిన భయపడి తీరవలసినదే. అట్టివాడునుమా భగవంతుడు. ఆ భగవన్మహిమాను వర్ణనసందర్భమున నెట్టి మహాపురుషులకీ ధోరణియే సిద్ధమగును. ఇందోంకారమునుగాని, బ్రహ్మమును గాని స్పృశింపక సర్వేశ్వర సర్వజ్ఞత్వాదుల నేల స్పృశించెను. అని శంకితురేమో! యీమంత్రమునందు మహర్షు లుపయోగింపబడిన 'సర్వ' శబ్దముచే పారిభాషికముగ ప్రణవబ్రహ్మములు నిర్వహింపబడినయవి. అయినను ప్రణవబ్రహ్మములు ప్రతీకమాత్రములని నిశ్చయింపుడు. ఇది ప్రణవబ్రహ్మాతీత స్వరూపానందానుభవ సమయసంజాత దివ్యవాణి. ఇతిశివమ్.

## ౭. మంత్రము

**నాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం, అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥**

తా॥ ఈ మంత్రమునందు ముఖ్యమగు వాక్యము 'స ఆత్మా' అనియును తదనుబంధముగ "స విజ్ఞేయః" అనియును కలదు. మొదటి

వాక్యము ఆత్మలక్షణనిర్వచనము చేయుచున్నది. రెండవవాక్యము ఆత్మ విజ్ఞేయమని సాధనోపాయమును చెప్పుచున్నది. ఈయాత్మ స్వరూపము ఎట్టిదో కొన్ని విశేషణములచేత నిరూపించెను. ఇందలి విశేషణములు నిషేధములుగను ప్రసిద్ధములుగను నేతివాక్యములుగను ఇతివాక్యములు గను నున్నవి. వర్తమానాద్వైతవేదాంతమునందు కేవల నేతివాక్యములకు ప్రాబల్యమును పాటించుకొని యాభాసనాస్తికు లైపోవుచున్నారు. ప్రచ్ఛన్నబౌద్ధులని నిందింపబడుచున్నారు. నిజముగ నిషేధముఖమే బ్రహ్మతత్త్వ మనినయెడల బౌద్ధమత నిర్వాణవాదమువంటి వాదమే నిలువవలసివచ్చును. కొందరు బౌద్ధమతమునెడల కనికరము చూపి బౌద్ధమతము నాస్తికమతముకాదని తమ పాండిత్యప్రతిభవలన స్థాపించుచున్నారు. శాబ్దము ప్రమాణముగాదని వేదములు అప్రమాణములని చెప్పనిశ్చయించినవారు నాస్తికులని మున్మ్నారు చెప్పవలయును. సంపూర్ణముగ పరమతత్త్వమును వాచోవిధేయము గావింపదలచెడు దుష్టతర్కములను ఉపనిషత్తులు స్పష్టముగ ఖండించుచున్నవి. కావుననే బౌద్ధులు ప్రమాణ పటువులని వర్ణింపబడినది. బౌద్ధులు ప్రమాణ ప్రమేయ సబంధ నిర్వాహణదక్షు లగునెడల వైదికులు ప్రజ్ఞాన ప్రజ్ఞేయ సాతత్య సమరసు లని చెప్పవలయును. ఈమంత్రమునందు (1) ఏకాత్మ ప్రత్యయసారం (2) ప్రపంచోపశమం (3) శాంతం (4) శివమ్ (5) అద్వైతం. ఈ అయిదువాక్యములును శిష్యానుగ్రహముకొరకు ఇతివాక్యములతో ఆ తత్త్వమును బోధించుచున్నవి. మిగిలిన విశేషణ వాక్యములెల్ల నిషేధవాక్యములే. కాని యీ నిషేధవాక్యముల నన్వయించుటలో విద్వాంసులు కొందరు ప్రమాదపడినట్లు స్ఫురించుచున్నది. ఆ ఆత్మతత్త్వము అంతఃప్రజ్ఞముకాదు అని చెప్పుటచే బహిఃప్రజ్ఞము(విజ్ఞేయము)అని తట్టకమానదు. అట్లే బహిఃప్రజ్ఞముకాదు అనినప్పుడు అంతః ప్రజ్ఞము అని చెప్పవలసివచ్చును. నబహిరంతః ప్రజ్ఞము

అను వాక్యమువలన ఉభయవిలక్షణము అని చెప్పవలసివచ్చును. ఇట్లే అన్ని నిషేధ వాక్యములును నొక ప్రసిద్ధవాక్యజ్ఞానావగతికి నుపదేశింపబడియున్నవి. అట్లుపదేశింపబడక యుండినయెడల యీ మంత్రము నందలి కడపటివాక్యము 'నవిజ్ఞేయః' నిష్ప్రయోజనమగును. ఆతత్త్వము అజ్ఞేయమయ్యు విజ్ఞేయము కావలయును. దీనినే గీతాధోరణిలో చెప్పవలయుననిన అతీంద్రియమయ్యు బుద్ధిగ్రాహ్యము కావలయును. కావుననే యెన్ని యోగము లవలంబించినను పరమార్థము నెఱుగనివారై చాల మంది చెడిపోయిరని గీతాచార్యులు వగచి గీతాముఖమున బుద్ధియోగము నుపదేశించెను. ఆ బుద్ధియోగ సత్తకు మూలాధారము లన్నియు నుపనిషత్తులందు సంగ్రహింపబడియున్నవి. ఆతత్త్వము విజ్ఞేయమగుటచేతనే యీ యుపనిషత్తు చెప్పబడెను. ఈమంత్రమునకు పూర్వము ఆత్మచతుష్పాత్తు అని చెప్పబడి యీ మంత్రమునందు ఏకప్రత్యయ సారముగ ఆత్మనెఱుంగుమని యుపదేశించుచున్నది. కావుననే యీమంత్రము నందు "చతుర్థంమన్యంతే" నాల్గవదానినిగ నెఱుంగుచున్నారు అని వ్యావహారికముగ బోధించి పరమార్థమున ఏకప్రత్యయసారమని నిర్ణయించెను. ఇంతవరకును అంతఃప్రజ్ఞ బహిష్ప్రజ్ఞత్వాది లక్షణములతో వర్ణింపబడిన ఆత్మ వేరొకటియనియు, ఇట్లు వర్ణింపబడిన ఆత్మ ఇంకొకటియనియు భ్రాంతిపడి ద్వైత భావాపన్ను లగుదురేమో యని స్పష్టముగ అంతః ప్రజ్ఞముకాదు బహిష్ప్రజ్ఞముకాదు అని పూర్వోక్తలక్షణములను విలక్షణములనుగా గ్రహించి బోధించుటచే యీమంత్రమునందలి ఏకప్రత్యయసారమును గ్రహింపవలెనని స్పష్టపరచుచున్నాడు. అనగా పరమాత్మ తత్త్వము అంతఃప్రజ్ఞమాత్రము, బహిష్ప్రజ్ఞమాత్రము, నోభయతః ప్రజ్ఞమాత్రము, అని మాత్రశబ్దము నన్నింటికి నుపయోగించి నిషేధములను సమన్వయింప వలయునని ఏకాత్మ ప్రత్యయసారమును చూపుచున్నాడు. ఇంతవరకును భిన్నాత్మ

ప్రత్యయము బోధపడినది విశ్వాత్మ, తైజసాత్మ, ప్రాజ్ఞాత్మ అని భిన్న
భిన్నముగ నుపన్యసించి అన్నింటిని మాంత్రమానం [illegible]
అదియే ఏకాత్మప్రత్యయసారము. ఈ ఏకాత్మప్రత్యయ సారమగునదియే
ప్రపంచోపశమమై, శాంతమై, శివమై, అద్వైతమగును. ఈ ఆత్మతత్త్వ
నిరూపణమునందు అల్పరూపమువరకును మహద్రూపమువరకును, [illegible]
ద్యవస్థాపన్నునకును, తదతీతునకును, జీవునకును, తదతీతునకును ఆత్మశబ్దమే
వాడుటంబట్టి ఆత్మయే సర్వము గదాయని "నేనే నేను నేనేశివుడ నేను
బ్రహ్మనైయున్నాను, నేను శాశ్వతుడను అంతానేనే" అని యనుకొనుచు
దురహంకారోద్ధారదుష్టాద్వైతమునకు దారితీసెను. అవస్థాపన్నాత్మయు
తదతీతాత్మయు ఆత్మ వాచ్యము కాకుండినయెడల ఆ రెండిటికిని ఐక్య
మసంభవమని యెఱిగి సమానమైన ఆత్మశబ్దమును [illegible] వాడుచున్నారు.
జీవాత్మ 'అంశము' గాని 'అంశి' కాదు. అంశమగు జీవాత్మ అంశిలోనుండ
దగుటయే సాధనము. అంశిలోనుండిన అంశము స్వగతభేదముతో
ఉన్నదాయని తర్కింతురు. ఈ తర్కము తర్కవాక్చమత్కారము తప్ప
తత్త్వము కాదు. అంశియైన సూర్యునినుండి అంశరూపమున ప్రసరించిన
నత్యంతసూక్ష్మ సూక్ష్మకిరణ పరీక్షయందు అంశియగు సూర్యుడే గ్రహింప
బడుచున్నాడని సూర్యునియందు స్వగతభేదము చెప్పరాని యట్లు పర
మాత్మయందు స్వగతభేదము చెప్పరాదు. కావున జీవుడు బ్రహ్మము
కానేరడు. జీవుడు 'బ్రాహ్మము' అగును. ఈ ఘట్టమునందు రజ్జుసర్పము
లను బ్రహ్మజీవాభేదమునకై యుపమానముగ గ్రహింతురు. ఈ యుప
మానము సర్వథా సమర్థముకాదు. జీవ, బ్రహ్మలు రెండును ఆత్మ
వాచ్యములు. రజ్జుసర్పములు రెండును రజ్జువాచ్యములు కావుగదా!
ఐనను రజ్జుసర్ప సంబంధ జ్ఞానము అధిష్ఠానభూత రజ్జుజ్ఞానమున కని
చెప్పుకొన్నచో ప్రమాదము రాదు. అనుభవమునకును దూరము
కాదు. త్రాటినిజూచి పామని భ్రాంతిపడు వాడు గురుకృపవలన

పాముకాదని త్రాడేయని తెలిసికొనినంత మాత్రముచేత పాము త్రాడై పోవదు. అట్లు పాము త్రాడై పోయినయెడల ఆ త్రాటియందు పాము గుణమును చూచుట కవకాశమే లేకపోయెడిది. అజ్ఞానికి త్రాటియందలి పాము భయాదికారణమై యొకప్పుడు మరణకారణమును గావచ్చును. ఇట్టి సర్పభ్రాంతిజన్యమైన మహా భయనివారణమే రజ్జుజ్ఞానకారణముగాని, రజ్జుగత సర్పత్వాకృతి నిరాకరణము గానేరదు. అట్లే బహిఃప్రజ్ఞమునను అంతఃప్రజ్ఞమునను మొదలగు సంజ్ఞలచే వ్యవహరింప బడిన ఆత్మ అంతః ప్రజ్ఞాది విలక్షణమై ఏకాత్మ ప్రత్యయ సారభూతమగునని ఆ ఆత్మవిజ్ఞేయము మని యుపదేశించుచున్నది. ఈ ఆత్మతత్త్వము అదృష్టమని నిర్వచింపబడినది. ఇది యదృష్టమేయగునెడల ఆత్మద్రష్టవ్యమను యుపదేశము నిరర్థకమగును కాబట్టి ఆత్మ దృష్టమాత్రము కాదని యర్థము కావలయును. గీతల యందును లీలామానుష విగ్రహుడనైన నన్ను మూఢు లవమానించు కొందురు. నాయొక్క పరమార్థము నెఱుంగరు (9 అ–11 శ్లో.) అనియున్నది. కావుననే భగవంతుని విశ్వరూపము ఘోరరూపమై మహద్రూపమై సుందరరూపమై అర్జునునకు కన్పట్టెను. దృష్టమును, అదృష్టమును అదియే అనుదానిని నిశ్చయించుకొనవలయును. ఆత్మ అవ్యవహార్యము అనుదానికి కేవల వాచోవిధేయము కాదని యర్థము. నిజముగ అవ్యవహార్యమే యగునెడల యీ యుపనిషత్తునకు వాగ్వ్యవహార ప్రసక్తియే లేకపోవలసివచ్చును. అగ్రాహ్యమను నప్పుడుగూడ "ఆత్మ ఇంతటిది, ఇట్టిది" అని కేవల ప్రమాణప్రమేయఫలక నిరూపణమున కందనిది అనిచెప్పవలయును. అట్లు చెప్పకున్నచో బుద్ధి గ్రాహ్యమన్న వాక్యము ప్రమత్తము కావలసి వచ్చును. ఆత్మనిధిధ్యా సితవ్యమను వాక్యము నిష్ప్రయోజనము కావలసి వచ్చును కావున కేవల మగ్రాహ్యము కాదు. ఇంతయేల వేదాంత శాస్త్రమందుగల సకల నిషేధవాక్యములును. కేవలము కాదు. అనునర్థమునంటే

సమన్వయింపవలయును. నిరాహారశబ్దమునకు నియతాహారార్థము ఎట్లు చెప్పబడెనో అట్లే నిషేధవాక్యము లన్వయించుకొనవలయును. అలక్షణము, అచింత్యము, అని చెప్పుటవలన, లక్ష్యము కానేరదనియు, చింత్యము కానేరదనియు అర్థము చెప్పుట తప్పు. అచింత్యః అనుదానికి అజ్ఞేయః అనిఅర్థము చెప్పుకొని ఆ అజ్ఞేయమువిజ్ఞేయము కావలెనని సమన్వయించుకొనవలెను కాకున్న యీమంత్రము కుతంత్రము. అట్లే అవ్యపదేశ్యమను విశేషణమునకును అర్థము గలదు. నిజముగ ఆత్మ అవ్యపదేశ్యమే యగునెడల "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" "ఓమిత్యుపాసీత" "ఓమ్‌తిదాత్మా" యీ మొదలగు వాక్యములు వ్యపదేశించుట వృథాశ్రమ మనవలయును. అందుముఖ్యముగ ప్రణవోపాసనమునకై యవతరించిన యీ యుపనిషత్తు మరియు నిష్ఫల మనవలయును. కావున ఆత్మత్త్వము అవ్యపదేశ్యము కాదు. ఓంకార రూపమైన ప్రతీకముచే వ్యపదిష్టమగుచున్నది. అవ్యపదేశ్యమనగా, కేవల మోంకారమాత్రముగాదనియే యర్థము చెప్పుకొనవలయును. ఓంకారము సన్నిహితము; తదితరము దూరము అనియర్థము. ఇంతవరకును ఆత్మతత్త్వము బ్రహ్మవాచ్యమై, అవచ్ఛేద కావచ్ఛేద్యత్వదోషము లేనిదమై నిర్వహింపబడెను. ఇంక ఏకాత్మ ప్రత్యయసారమని ఇతిబోధమును చేయుచున్నాడు. విభక్తముగ కానవచ్చినను, వివిక్తమున ఏకరూపమని చెప్పుచున్నాడు. గీతలయందును "జ్ఞానము, అపోహనము, స్మృతి, భ్రాంతి, మున్నగునవి నావలననే ( అ 15 - శ్లో 15 ) అని యుపదేశింపబడియున్నది. అనగా అవిభక్తమై, సంసక్తమై, సంపూర్ణమైయుండిన తదాధారముననే విభక్తాదులు వ్యవహారమున స్వానుభవమునకు వచ్చుచున్నవని యర్థము. 'నేనీకుండ నెరుంగుచున్నాను' అను కుండయొక్క ఎరుకఅనెడు ఘటాకారక జ్ఞానాధిష్ఠానము ఆత్మయే యగుటవలన, ఆత్మ ఏకప్రత్యయ సారమని సంగ్రహముగ నుపదేశించు చున్నాడు. ఇందలి

ప్రపంచోపశమ శబ్దమునకు, ప్రపంచ ప్రణాశమనియు, ప్రళయమనియు అర్థములు చెప్పుకొనుచున్నారు. అదితప్పు. నిద్రాదశయందు ప్రపంచోపశమ మనుభవమెట్లో అట్లే ప్రపంచోప శమలక్షణమును చెప్పుకొన వలయును. కావుననే జీవునకుగూడ జాగరితస్థానమును, సుషుప్తస్థానమును పొందుటయుం దిష్టమును లీలారూపమున ననుభవమగుచున్నది. ఈ ప్రపంచోపశమశబ్దమునకే శాంతమని యర్థము చెప్పుకొనవలయును. ఆ 'శాంతము' రసవాచ్యమని తెలిసికొనుడు. కావుననే అది శివమని చెప్పుచున్నాడు. శాంతమగునదియే శివవాచ్యమగును. శివమనగా మంగళమని యర్థము. భగవత్తత్త్వముకంటె మంగళమైనది మరియొకటియునుగాదు అదియే అద్వైతము. ఇందలి యద్వైతశబ్దమును గ్రహించి నేనేబ్రహ్మమును అనెడు వెర్రికేకలు వేయరాదు. భగవత్స్వరూపమైనది వేరొకటిలేదని యర్థము. ఈయద్వైతవిశేషణమును తీసికొని కొందరునిరోధములేదు ఉత్పత్తిలేదు బంధములేదు మోక్షములేదు సాధనములేదు సాధకుడులేడు గురువులేడు శిష్యుడు లేడు మాండూక్యోపనిషత్తు లేదు ముట్టెగడ్డలు లేవు అని లేమిలో కొట్టుకొనుచున్నారు. అందలికిటుకు జిలుగులు వారికి గానరావు. కావున నద్వైతమనగా సకలభావములందు సన్మాత్ర తత్త్వము ననుభవించుటయని యర్థము. అట్లగుచో మీవాద సర్వాస్తివాదమా యని రయికనామకరణము చేయనక్కరలేదు. భగవత్తత్త్వమద్వైతము. వేదములయందు "సన్మూలాః ఇమాః ప్రజాః" అని సన్మూలము నిరూపింపబడెను. ఇంక చతుర్థము అనువిశేషణము మాత్రము మిగిలియున్నది. ఈ విశేషణమువలన యీ మంత్రమునం దుపదేశింపబడిన తత్త్వము పూర్వమంత్రవిలక్షణ మైనదని యర్థముచెప్పరాదు. అట్లు చెప్పరాదని "స ఆత్మా" అనువాక్యముతో నుపసంహరించుచున్నాడు. ఆత్మ సంజ్ఞ గలదియెల్ల నిదియే సుమాయని చెప్పుచున్నాడు. కావుననే దీనికి తురీయ

మని సంజ్ఞ. 'చతుర్థపదము' 'మన్యంతే' అనుపదముతో నన్వయింప వలసివచ్చునుగాన చతుర్థత్వమునకు ప్రాధాన్యము చెప్పవలయును. "స ఆత్మ సవిజ్ఞేయః" ఈ రెండువాక్యములును పూర్వోపదిష్టమైన తత్త్వమును సమగ్రోప సంహారము చేయుటకై చెప్పబడినవి. ఆ ఆత్మ 'సః' అను విఖ్యాతార్థముతో వర్ణింపబడియున్నది. అదియే ఓంకారము. ఓంకార మును ప్రతీకముగ చేసుకొని ఆ ఆత్మ యొక్క రూపము నెఱుంగవలయును అని "సవిజ్ఞేయః" అను వాక్యములో నుపదేశించుచున్నాడు. ఇందలి సమన్వయము కష్టమగుటంబట్టియే గురువుల నాశ్రయింప వలయునని సంప్రదాయమున్నది. గీతలయందును "తత్త్వదర్శులు నీకుపదేశింతురు" (4-34)" గురువును పొందుము అని వేదమునందును చెప్పబడియున్నది. గురుపరంపరలోని ఆపరమార్థము నెఱుంగకయే ప్రణిపాత పరిప్రశ్న సేవాదికముల చేయనొల్లక తమ హృదయ కుహరాంతరాళములయం దారాధింపబడుచున్న దురహంకార బ్రహ్మరాక్షస పీడితులై పాండిత్య మును పరోక్షముగ గ్రంథావలోకనమును మాత్రమే నమ్ముకొని కొందరు పాడగుచున్నారు. అట్టివారే వాయువే బ్రహ్మమనుకొనుచు, ఇంద్రుడే బ్రహ్మమనుచు, చంద్రుడే బ్రహ్మమనుచు, సూర్యుడే బ్రహ్మమనుచు, ఏదియో యగోచరతత్త్వమే బ్రహ్మమనుచు తలతిక్క నిర్ణయములలో తులతూగుచున్నారు. ఆ తూగెడివారికిట్లుతూగనిండు. మంత్రమునందు- "అయమాత్మా బ్రహ్మ సోఽయమాత్మా చతుష్పాత్ సవిజ్ఞేయః" అనువాక్యములు పరస్పరాన్వయములతో కూర్పబడియున్నవి. కావు ననే జ్ఞేయత్వము వివేకపూర్వకముగ ఉత్తరమంత్రమునుండి యారం భించుచున్నాడు. ఇతిశివమ్

# ౮. మంత్రము

సో౽య మాత్మా౽ధ్యక్షర మోంకా
రో౽ధిమాత్రం పాదామాత్రా మాత్రాశ్చ
పాదా అకార ఉకార మకారఇతి

తా॥ ఈ మంత్రమునందు అధ్యక్షర మోంకారము అనునది ముఖ్యవాక్యము. ఈ ముఖ్యవాక్యమునుబట్టి పూర్వమంత్రములయందు చెప్పబడినది సాధ్యమగునంతవరకు కేవలాత్మతత్త్వ నిరూపణమని తెలియబడుచున్నది. ఆ ఆత్మతత్త్వమే అభిధేయమని పిలువబడును. అభిధేయ మవ్యవహార్యమని చెప్పుకొన్నచో బోధనావకాశమే లేక పోవును. కావున అభిధేయాభిధానములు, నామనాములు, శబ్దార్థములును అవినాభావములని పెద్దలవ్యవహారము. ఇందభిధానతత్త్వము నిరూపించుచున్నాడు. ఆత్మతత్త్వనిరూపకమై అత్యంత సన్నిహితమైన యభిధానము వైదికులకోంకారమని సంప్రదాయజ్ఞు లెరుంగుదురు. ఈ ఓంకారమే సన్నిహితాభిధానమని యోగశాస్త్రాదులయందును నిర్వచింపబడియున్నది. భగవంతుని, ఏనామముతోనైనను, ఏరూపముతోనైనను, ధ్యానింపవచ్చునుగదా యని ముదురు తర్కములలో మునిగి పోవుటకంటె, వేదములయందును, శాస్త్రములయందును ఓంకారమే గ్రహింపబడెనని ప్రామాణికబుద్ధితో నుండుటశ్రేయస్సు. ఒక నామము నిర్హేతుకముగ పుట్టబడదనియును, ఆనామ మీశ్వరసంకేత మనియును, శాబ్దికుల నిర్ణయము. కావుననే అభిధానము అనాదినిధనమని బ్రహ్మనిర్మితమని చెప్పబడియున్నది. ఆకలి నివారించుకొనుటకు జీర్ణకారియు సంప్రదాయోచితమును అగు ప్రత్యేకాహారమే ఎట్లు కావలసి యుండునో, ఇసుక, మన్ను మొదలగునవి యాహారించుటవలన

త్మున్ని వారణోపాయము ఎట్లుగాదో. అట్లేభగవ దుపాసనమునకు అభిధానముగ స్వీకరింపబడినది; ఓంకారమని ఎఱుంగుద [illegible] కారాదు లనభిధానములు. అట్టి ఓంకారము యీ ఆత్మస్వరూపమే యని అధ్యక్షరరూపమున నుపన్యసించి పూర్వముచెప్పబడిన ఆత్మయొక్క చతుష్పదత్వ సమన్వయ మీయక్షరమునందు వాఖ్యానించుచున్నాడు. ఈవ్యాఖ్యానమే పరమార్థమనుకొని చాలమంది ప్రణవమర్మ మెరుంగని వారైరి. అభిధానమును సమన్వయించుట మాత్రమే యీ మంత్రమున కుద్దేశము. కావుననే అకారోకార మకారములని మూడక్షరములను గ్రహించెను. ఓంకారమధ్యక్షర మగుటవలన మాత్రరూపముతో అధి మాత్రమని సమన్వయించుచున్నాడు. పాదములు పూర్వమునందు జాగ్రత్స్వప్నాదులనుగ సమన్వయించి, మాత్రలను అకారాదులనుగ సమన్వయించుచున్నాడు. ఏకాత్మ ప్రత్యయసారముగ పూర్వ మెట్లుప సంహరించెనో అట్లే ఇందును. 'సోయమాత్మా ఓంకారః' అను వాక్యము గ్రహింపబడితీరును. ఈయుపనిషత్ప్రారంభమున చెప్పబడిన 'ఓమిత్యేతదక్షరం' అను మంత్రవాక్యసమన్వయమే యిందు ప్రారంభింపబడుచున్నది.

ఇ తి శి వ మ్

## ౯. మంత్రము

జాగరితస్థానో వైశ్వానరోఽకారః ప్రథమా మాత్రాఽఽ,
ప్తేరాది మత్త్వాద్వాఽఽప్నోతిహ వై సర్వా
న్కామాన్ ఆదిశ్చ భవతి యఏవంవేద॥

తా॥ ఈమంత్రములో 'యఏవంవేద' అనువాక్యము కడపటి మంత్రముపరకును వ్యాపించెడు మహత్తర వాక్యమైయున్నది. కావున

పూర్వ మంత్రములయందలి స్వజ్ఞేయః అనుదానిని నిరూపించుట ముఖ్య
మయ్యెను. ఈమంత్రములో అకారోకార మకారములలోని మొదటి
దగు అకారమును సమన్వయించుచున్నాడు. ఈ సమన్వయ మర్థ
వాదముగాని తత్త్వవాదముకాదు. ఇది యర్థవాదమా తత్త్వవాదమా
యని నిర్ణయించుటకిందే యాధారముగలదు. ఆప్తి వలనః ఆదిమత్త్వము
వలననో సర్వకామప్రాప్తి వలననో ఆది యగుచున్నది అకారము, అని
ఇదమిత్థమని నిర్ణయింపక అదియో ఇదియోయని నిర్ణయించుచుండుటం
బట్టి అర్థవాదమని చెప్పవలయును. ఓంకారము తత్త్వవాదము కావున
ఓంకారోవా ఝూంకారోవా అని చెప్పబడలేదు. 'వా' శబ్దమూపయో
గింపబడిన ఘట్ట మర్థవాదము. అర్థవాదమునకును ప్రయోజనము కలదు
కావున ప్రణవప్రశంస నెఱుంగుదము. జాగరితస్థానుడైన వైశ్వానరుడు
అకారాన్వితుడు. ఆప్తివలన అనగా సర్వవ్యాపనశీలము గలవాడగుట
వలన బోధమునంద చాదియందు దుద్దేశింపబడినవా డగుటవలన, అకార
వాచ్యుడని చెప్పుచున్నాడు. సకలోపదేశములును వైశ్వానరపురుషు
నుద్దేశించియే ప్రవర్తించునుగాని తదితరపురుషులతో పనిలేదు. దీనిని
బట్టి స్వప్నమునందు నాకవగతమయ్యెను. స్వప్నమునందు నాకుపదే
శింపబడెను అనిచెప్పుకొనుచు తృప్తిచెందుట దురహంకారదర్ప కారాధ
నమే. దర్శనశ్రవణమనన విషయాదులెల్ల వైశ్వానరాధీనము లని మరి
యొక్కమారెఱుంగుడు. మరియును 'సర్వాన్కామానాప్నోతి' అని
వేరొక వాక్యము కలదు. ఈ వాక్యము సిద్ధాంతవాక్యము. ఈ వాక్యము
నందు "వా" పక్షములేదుకావున సిద్ధాంతము. దీనినిబట్టి సమస్తములైన
కామములను పొందుచున్నాడని యీ వాక్యమునకర్థము. దీనినిబట్టి
సర్వకామసిద్ధికొరకీమంత్ర మునుపదేశింపబడినదని తలంపరాదు. వైశ్వా
నరుడు కాముకుడు అనువిషయము స్పష్టముచేయుటకు చెప్పెను. ఎంత
వరకు కామవ్యాపారము దనయందుండునో అంతవరకు అంశభూతుడై

బహుళాంగముఖుడై బహువిధ జన్మమరణరూప ఘోరసంసారమున పడుచు లేచుచున్నవాడై ఏకాత్మప్రత్యయసారవిరహితుడై పోవునని స్పష్టముగ హెచ్చరించుచున్నాడు. ఈ హెచ్చరికలే, వేదాంతశాస్త్రము నం దెల్లగలవు. కావున నెవడు వైశ్వానరునియొక్క యీస్థితినెరింగి ఓంకారాభిధానము నాలంబనముచేసికొని ఆత్మవంతుడగునో అట్టివాడు సుఖపడునని సిద్ధాంతము చేయుచున్నాడు. కావున ఈ మంత్రము నందు 'య ఏవం వేద' అనువాక్యముతో నుపసంహారము గలదు. ఇతిశివమ్

## ౧౦. మంత్రము

స్వప్నస్థాన స్తైజస ఉకారోద్వితీయా
మాత్రోత్కర్షాదుభయ త్వాద్వోత్కర్ష తిహ వై
జ్ఞానసంతతింసమానశ్చభవతి నాస్యాబ్రహ్మవి
త్కులే భవతి య ఏవం వేద —

తా॥ ఈ మంత్రముగూడ పూర్వమస్త్రిధోరణిలో చెప్పబడెను. ఈ మంత్రమునందు స్వప్నస్థానుడైన తైజసపురుషుడు ఉకారసాదృశ్యముతో నిర్ణయింపబడుచున్నాడు. (న్యాయ్యమ్॥ యత్రయత్ర 'వా' పక్షమాశ్రిత్యవికల్పేన తద్వాయద్వా ఇతి నిరుక్తిః క్రియతే తత్రతత్ర అర్థవాద ఏవేతి నిర్ణేతవ్యః॥) ఈన్యాయ్యమునుబట్టి యిందును నర్థవాదము గలదు. ఈ తైజసుడు ఉత్కర్షుడగుటంబట్టి, ఉభయుడగుటంబట్టి, ఉకారవాచ్యుడగుచున్నాడు, అనియర్థము. ఈ మంత్రమునందలి 'జ్ఞానసంతతి'

శబ్దము జ్ఞానప్రవాహిని అనుసర్థముగలది. కొందరు జ్ఞానసమూహమని చెప్పిరి. అదిపొసగదు. జాగరితస్థానమునందు జ్ఞాతానుభూతి విషయములే స్వప్నస్థానమునందు సరూపముగనో, విరూపముగనో, సలక్షణముగనో, విలక్షణముగనో పరిణమించుట సర్వానుభవసిద్ధము. జాగరితస్థానమే లేని నాడు స్వప్నస్థానములేదు. కావున జాగరితస్వప్న స్థానములయందు, జ్ఞానము ప్రవహించునదియగును. ఈస్వప్నస్థానుడు సమానుడగుచున్నా డని చెప్పబడుచున్నది. సమానుడనగా ఉదాసీనుడనియు శత్రుమిత్ర భావరహితుడనియు కొందరన్వయించిరి. ఆ యన్వయము న్యాయ్యము కాదు. స్వప్నమునందు పరపురుషోపభుక్తయైనట్లు తన భార్యను చూచినచో శంకించి జాగరితస్థానమునందు ధర్మపత్నిని విడువనొల్లడు. కావున జాగరితస్వప్నస్థానముల జ్ఞానసంతతియెట్లున్నను జాగరితస్థానము నందు విపరిణామమును పొందక తైజసస్థానమునందు వికారమునొందక, యీ రెండింటిని సమానలక్షణముగ ఎవడెరుంగునో అట్టివాడు సుఖు డగునని చెప్పుచున్నాడు. అనగా జాగరితస్థానమునకును స్వప్నస్థానము నకునుగల అన్యోన్యసంబంధము చక్కగ నెఱుంగుటకు ప్రయత్నించుటయు ముఖ్యమని సూచించుచున్నాడు. తన్ను తాను పరీక్షించుకొనుటకు స్వప్నస్థానము, చక్కనిప్రమాణస్థానము. బంగారమును నాణ్యమెఱుంగు టకు నికషోపలమెట్లో వైశ్వానరుని యాంతరికము నెరుంగుటకు స్వప్న మట్లు. కావుననే నిదియును జ్ఞేయవిషయముగ నుపన్యసించుచున్నాడు. కొందరు స్వప్న మర్థరహితమని నిరసించుచున్నారు. అట్టినిరసనము ధర్మబద్ధముకాదు. వైశ్వానరుడు, తైజసుడగుటయెట్లో అట్లేవర్తమాన దేహవంతుడు భవిష్యద్దేహవంతుడగుచున్నాడని పూర్వోత్తర జన్మ ములను కలవని నిర్ణయించుటకు తనకు స్వాయత్తమైన పరమప్రమాణ

మిదాస్వప్న స్థానము. కావుననే యీ వాక్యమున కంతరమునందు 'అస్య అబ్రహ్మవిత్ కులే నభవతి' అని సిద్ధాంతవాక్యమును చూపుచు న్నాడు. ఇతని కులమునందనగా ఇతని వంశమునందని కొందరర్థము చెప్పుచున్నారు. ఇందలి 'కుల' శబ్దమునకు సమూహమని యర్థము. జాగరితస్వప్న స్థానముల నెరింగినవాడు భిన్న భిన్న ముగను నానావిధము గను తనకనుభూయమానమైయున్న జ్ఞానమంతయును ఏకీభూతమైన ఏకాత్మ ప్రత్యయసారముగ ఎవడు నిర్ణయించుకొన గలుగునో వాడు ధన్యుడని, అబ్రహ్మవిత్తుకాడనియు స్పష్టముగ చెప్పుచున్నాడు. ఇందు నుగూడ 'యఏవంవేద' అను వాక్యముతో ఉపసంహారము గలదు. ఇట్లుపసంహారింపబడుటచే తెలిసికొనవలయుట (వేత్తృత) ప్రధానమని ముఖ్యముగ నుపదేశించుచున్నది. కలయని త్రోసివుచ్చరాదు. కలలోని వాడు తైజనవాచ్యుడగుటబట్టి వైశ్వానర తైజసుల కార్యకారణ భావమును పునరాలోచించుకొనుట జిజ్ఞాసువులకు ముఖ్యధర్మము. ఇతిశివమ్.

## ౧౧. మంత్రము

సుషుప్తిస్థానః ప్రాజ్ఞోమకారస్తృతీయామాత్రా :
మితేరపీతేర్వామినోతిహవా ఇదగ్ంసర్వమపీతిశ్చ
భవతి య ఏవం వేద ॥

తా॥ ఈమంత్రమునందు పూర్వమువలె మకారముతో ప్రాజ్ఞ పురుషు నన్వయించి చెప్పుచున్నాడు. ఈమకారము ఓంకారముయొక్క-

అంతర్నాదకము గాన్పున అకారము మొదలుకొని మకారమువరకు పలుకబడిన ఓంకారధ్వనియందు స్ఫోటము కలదని తెలియబడుచున్నది, ఒకశబ్దము శ్రవణేంద్రియమున గ్రహించి మననము చేయునప్పుడు నామ నామముల యవినాభావము గ్రహించుట కవకాశము కలిగియుండుటయే స్ఫోటమనబడును. మకారోచ్చారణానంతరమున గాని స్ఫోటమునకు పూర్ణత లభింపదు -- అనగా వైశ్వానర తైజస సమిష్టిజ్ఞానము లేకున్నను ప్రాజ్ఞుడై ఆనందభుక్కై కారణరూపమున అవ్యక్తదశయం దట్లుండునని పూర్వమునసే చెప్పియున్నాడు. ఇతడు మకారవాచ్యు డేలకావలసి వచ్చెనో వ్యాఖ్యానించుచున్నాడు. 'మితి' వలనను 'అపీతి' వలనను మకారవాచ్యుడనుచున్నాడు. మితియనగా మానకారణమనియు అపీతి యనగా లయకారణమనియు నర్థము. అనగా యీ సర్వమును మాన లయములయందు స్థాపింపబడినదని చెప్పుచున్నాడు. ఏదిఏది అనుమీ యమానమగునో (అనుమీయమగునదియెల్ల మాయ) అది యెల్ల లయము కావలయును. కావుననే జాయమానతయు, లీయమానతయు, యీనిద్రాదశనుండియే సంభవమగుచున్నవి. నిద్రనుండి రెండుదశలు కలుగుచున్నవి. స్వప్నదశ, జాగ్రద్దశ; యీరెండింటికి మూలకందము నిద్రయే. కావుననే నిద్రాపన్నుడు ప్రాజ్ఞుడని చెప్పబడుచున్నాడు. ఈ నిద్రావన్నుడు లయజ్ఞానవంతుడును, జాతి జ్ఞానవంతుడునునై జాగరితస్థానమునం దన్వయించుకొను చున్నాడు. అట్లగుటంబట్టి నిద్రను మరణస్థానీయముగ జాగరితస్థానుడు జిజ్ఞాసాబుద్ధితో నన్వ యించుకొని వైశ్వానర తైజస ప్రాజ్ఞపురుషుల ఏకాత్మ్య ప్రత్యయసార మల వరించుకొనవలయునని సూచించుటకై 'యఏవంవేద' అను వాక్య ముతో నుపసంహరించుచున్నాడు. ఇతిశివమ్.

# ౧౨. మంత్రము

అమాత్రశ్చతుర్థోఽ వ్యవహార్యః ప్రపంచో
పశమశ్శివోఽద్వైత ఏవమోంకార ఆత్మైవ సంవిశత్యాత్మ
నా ఽఽ త్మానం య ఏవంవేద యఏవంవేద ॥

తా॥ ఈమంత్రమునందు తురీయగమ్యుడైన అభిధేయుడగు పురుషు డభిధానరూపమైన ప్రణవముతో సమన్వయింపబడుచున్నాడు. ఇంతవరకు వ్యవహారయోగ్యమైన ప్రణవరూపముచెప్పబడి అవ్యవహార్యమైన ప్రణవమునందు లీనమగుట యెట్లో దానిని వివరించుచున్నాడు. ఆ ఓంకారము చతుర్థము అని చెప్పుటంబట్టి దానికి చతుర్థస్థానముకలదని యర్థముకాదు. ఈ చతుర్థమే తురీయమని పిలువబడును. తురీయమనగా భేదవివేచనతోకూడుకొనిన వివేకవిజ్ఞానవిశేషములు లేక ఏకమైయఖండమైయుండెడి తన్మయరూపమునకు సంగ్రహముగ తురీయమని పేరిడిరి. వివిధపదార్థములయొక్క సంసేవనమువలన శరీరమునకు పదార్థవైవిధ్య విజ్ఞానలేశాభావముతో మహౌజశ్శక్తి (Vitality) ఎట్లుసిద్ధమగునో అట్లే అకారాది విభాగాత్మక ప్రణవోపాసనము పరిణామమున అమాత్రమై అతిప్రమాణమై ప్రమాతృప్రమాణ ప్రమేయ త్రయీవిన్యాసముతో విలసిల్లక ఏకస్వరూపము ననుభవైకసౌందర్యముతో నుండుటంబట్టి అమాత్రమని వాడబడుచున్నది. ఆప్రణవమవ్యవహారము. అనాహతమని యర్థము ఆహతనాదమునకును అనాహతనాదమునకును గొప్ప భేదముకలదు. ఆహతనాదమునందు తరంగిణీరూపనాద ప్రవాహమనుభూయమాన మగును. ఆ తరంగముల ద్వైవిధ్యముతో తానుండును. కాని అనాహతనాదానుభవము పొందనేరదు. అనాహతనాదము

నిస్తరంగమై నిత్యాఖండమై నిష్ఠామాత్రగమ్యమై భేదరహితమై యుండును. ఆహతము నాడీముఖమున నంతఃకరణములయందు ప్రవేశింప, అనాహతము కేవలాంతరంగికమై సూక్ష్మకారణ తదతీత సర్వహృదయగమ్యమై అనుభవమునకు రమ్యమై యుండున దగును. కావున అవ్యవహార్యమని పిలువబడును. ఆ ఓంకారము అభిధేయమెట్లో అట్లే ప్రపంచోపశమాది లక్షణ లక్షితమై యున్నది. అభిధానాభిధేయముల కభేదము ప్రతిపాదింపకుండినచో అభిధాన ప్రాధాన్యము క్షీణించును. క్షీణశక్తి కాకుండుటకై అభేద పరమార్థమును నుపన్యసింపగ విని కొందరు "నేనే దేవుడను - నేనే బ్రహ్మమను, నా కితరమేదియు లేదు గావున కనుటకుగాని, వినుటకుగాని, మననము చేయుటకుగాని, ధ్యానించుటకుగాని, నమస్కరించుటకుగాని, ఏదియును లే" దని వాదించుకొనుచున్నారు. ఆవాదములో భేదమేగలదు. అది అభేద వాద తాత్పర్యము కాదు. ఆత్మధ్యానము అను పదమునందలి 'ఆత్మ'శబ్దమునకు అపార్థము గావించుకొని కొందరు తన నిజరూపమును ధ్యానించుట అని యర్థమును చెప్పుకొనుచున్నారు. తనకు నిజరూపమొకటి తద్విలక్షణ మింకొకటి లేనేలేదు. తనయొక్క శాశ్వతస్వరూప నిరూపణమునకు ప్రయత్నించు సాధనమున కాత్మధ్యానమని పేరు. తా నెందుండిన శాశ్వతుడగుట కవకాశముగలదో అందుండుటకు ప్రయత్నించుట కాత్మధ్యానమని పేరు. ఇందలి ఆత్మశబ్దమునకు అర్థమేమియని ప్రస్థానత్రయమును చక్కగ విమర్శించిచూచినచో గీతలయందు ప్రతిపాదింపబడిన పురుషోత్తమరూపమే అని బోధమగును. ఈపురుషోత్తమరూపము స్పష్టాక్షరములతో నుపనిషత్తులయందును, సూత్రములయందును లేదని వాదించుటయేకాక వేదములయందైనను 'పురుషోత్తమేతి' సమాసపదము దుర్లభమని తీవ్రపరిశోధనావాదవావదూకులు ప్రతిపదించుచున్నను, గీతాప్రామాణ్యమునుబట్టి ముముక్షు

రును లోకవేదములయందు పురుషోత్తమ వ్యవహారము కలదని చెప్ప వలయును. వేదములయందు కానరానిది సంప్రదాయములయందు ప్రవాహరూపముగ గురుపరంపరలోనివారికి గానవచ్చును. వేదవాక్యములయందలి స్వరవిశేషములెట్లున్నవో వేదములయందు గానరాకున్నను వైదిక పరంపరనుండియే గ్రహించి తీరవలయును. వేదములయందు "వరుణాదిత్యయమవాయువులు" బహుళముగ నుపాస్యములని చెప్పబడుటంబట్టి ఆత్మయేలేదని చెప్పవలసివచ్చును. మరియును వరుణాది సదుపాసనా నిరూపణము ప్రస్థానత్రయమునందు గానరాదు. వేదమునందొక మతము ప్రస్థానమం దింకొకమతము, వ్యాఖ్యానములయం దదొక్క మతము అవగాహనమునందు వేరొక మతము ఇట్లు తలకొక మతమై తత్త్వమును గ్రహింపనేరక పాడగుటకంటె వేద వేదాంత తద్వ్యాఖ్యానములయందున్న ఒక్క పరమార్థమునే గ్రహింపవలయును. మనవాఙ్మయములో "ఉపనిషత్తు" అను సాంప్రదాయిక పదమేలపుట్టెనో గ్రహించినచో కొన్నిరహస్యములు కేవలస్పష్టాక్షరములుగ లేవనియును, పరంపరలోనే నాటినుండి నేటివరకు కర్ణాకర్ణికగ, ముఖాముఖిగ, ప్రవర్తించుచున్నవని తెలిసికొన గలుగుదుము. ఇన్ని భేదాభాసములకును అభేదరూపముగ ఆనాటినుండి యీనాటివరకును సమానసత్తతో యీ ఓంకారమే వచ్చుచున్నది. ఈ ఓంకారమునకు పరమార్థమేమియని ప్రశ్నింపగా తత్త్వదర్శులు ప్రత్యుత్తర మిత్తురు. మన పూర్వపుణ్యావశముచే ఆ ప్రత్యుత్తరములలో నొకటిదియగు భగవద్గీతలోని పురుషోత్తమప్రాప్తియోగము మనకు లబ్ధమయ్యెను. అట్టి ప్రణవము ప్రపంచోపశమమై శివమై అద్వైతమై యొప్పుచున్నదని యీ మంత్రమునం దుపసంహరింపబడెను. అదియట్లుండనిండు. "ఆత్మచే ఆత్మనుద్దేశించి ఆత్మయందు ఆత్మప్రవేశించుచున్నది." ఆత్మైవసంవిశతి

ఆత్మనాఽఽత్మానం. అని యొక వాక్యముగలదు. ఈ వాక్యమునందు ప్రయోగింపబడిన ఆత్మశబ్దము సమానార్థకమా కాదా అనునది యొక శంక. సమానార్థకమే యగునెడల రచన మసాంప్రదాయము. రాముడు తనభార్యతో తనకనువగుచోటుల దిరిగి తానయోధ్యకు వచ్చెను — ఈ వాక్యమునే — "రాముడు. రామునిభార్యతో రామునికనువగుచోటుల దిరిగి రాముడయోధ్యకు వచ్చెను." ఈవాక్యమిట్లు వ్రాయబడినచో ఎంతయో ప్రమాదార్థవంతమగును. రచనాపద్ధతియునుగాదు. కావున ఈ వాక్యములో నుపయోగింపబడిన ఆత్మశబ్దము భిన్నార్థముగలది — ఇక అన్వయమిట్లగును. ఆత్మనా. అనగా ఆత్మవాచ్యమైనబుద్ధియోగముతో (ఆత్మా-బుద్ధి,) ఆత్మా=ఆత్మవాచ్యమైన జీవుడగు తాను, ఆత్మానం= ఆత్మవాచ్యమైన భగవంతుడగు పురుషోత్తముని రూపమును. సంవిశతి= ధ్యానించి ప్రవేశించుచున్నాడు. అని ఉపనిషత్తును పరిసమాప్తి చేయు సందర్భమున కలిగిన మహోల్లాసముతో ముక్తావస్థను వర్ణించెను. కావుననే యీ మంత్రాంతమునందు రెండుమారులు యఏవం వేద యఏవం వేద అనియుపన్యసింపబడెను. ఈ ప్రవేశనము జలగత లవణము వంటిదియా, జలగతజలము వంటిదియా అని తర్కవైదగ్ధితో కొందరు వాదింతురు. జలమునందు జలమువలె ప్రవేశించెనని తర్కబోధము కొరకనుకొనినను ప్రవేశించినవాడు ప్రవేశోచిత రూపమునుపొంది ప్రవేశించుచున్నాడని సమన్వయించుకొనుటయే శ్రేయము. వేదమునందును "తదేవసృష్ట్వా తదనుప్రవిశతి" మున్నగువాక్యములు గలవు. గుణసంమర్ద సంక్షోభము వలన నుత్తీర్ణుడై గురూపదేశబలముచే ఉపాసనాప్రాబల్యముచేతను శ్రవణ మననాది సమాచరణముచేతను క్రమముగ నుపాసకుడు ఉపాస్యమునందు ప్రవేశించి ఉపాస్యమే యగుచున్నాడని యన్వయము." "బ్రహ్మైవ భవతి. బ్రహ్మేతి చేద్వేద." అను వాక్యము నాధారముచేసుకొని, 'త ద్విదిత్వా తదేవ భవతి.' అను వేరొక వాక్యము నాకర్షించి బ్రహ్మనైయగు

వాడు బ్రహ్మమే అని రాద్ధాంతించుకొనుచున్నారు. ఇందలి పరమార్థ మదిగాదు: సత్యోపాసనాప్రతిపాదనమునకై యీ వాక్య ముపదేశింపబడి నది. బ్రహ్మజ్ఞానమునకే బ్రహ్మభూయస్త్వాప త్తికలదుగాని ఇతరమునకు లేదు. నేను రాజునగుదును అని రాజత్వము నుపాసించుచో రాజుకానే రడు. రాజత్వ మసత్యము కావున రాజత్వము బ్రహ్మాన్యము కావున రాజత్వము కల్పితత్వముగాన రాజత్వమున కుపాస్యత్వమే సిద్ధింపదు. సత్యమున కుపాస్యత్వము సిద్ధించునుగాని అసత్యమున కుపాస్యత్వము సిద్ధింప నేరదు. అసత్యమున కుపాస్యత్వము సిద్ధింపగలిగినచో ఎట్టివాడును గురువు కాగలడు; మరెట్టివాడును శిష్యుడు కాగలడు. అందరు గురువులే; అందరు శిష్యులే. కావుననే ఈశావాస్యమునందు ఆత్మహను లగు జనులు పాడగుదురని స్పష్టముగ చెప్పబడియున్నది. ఆత్మ జ్ఞానముయొక్క సర్వాతిశాయిత్వమును ప్రతిపాదించుటకు బ్రహ్మమును బ్రహ్మ తెలిసికొనుచున్నాడు అని చెప్పబడినది. ఇంతయేల, ఆత్మేతర భావనాభావితభావన సర్వథా అసంభవమై యుండును. ఆభావన భావ శుద్ధ్యనంతర భావనా గమ్యమగుటంబట్టియే గీతలయందు కృష్ణుడు "నత్వే వాహం జాతునాసం" ఇత్యాదిగ చెప్పి, "సర్వేవయమతః పరం" (2-12) అని తన్ను గలుపుకొని తత్పరభావనమునందుపసంహరించుకొనెను. ఈశ్లోక మనేక రహస్యార్థములతోగూడినదగుటబట్టియే వ్యాఖ్యాతలనేకులు పాం డిత్య మాత్రపరతు విచ్ఛేదనాకౌశలమును నెరపిరి. అది కౌశలమేకాని పర మార్థముగాదు. "బ్రహ్మేతి వేదచేత్ బ్రహ్మైవభవతి" అనువాక్య మును తీసుకొని, "ఘటఇతి వేదచేత్ ఘటోభవతి" అని పరమార్థమును నిరూపింప గలుగుదుమా? ఇది వేదనారూపమునందలి క్రమవిధానము గాని వేదార్థముగాదు. కావున కట్టకడపట ఆత్మప్రవేశనమునకు పరమో పాయముగ సర్వప్రకారముల "శ్రీవాసుదేవం శరణమహంప్రపద్యే" అనునదియే పరమోపాయము అని నిశ్చయింపవలయును. ధర్మాధర్మ

ములు కర్మాకర్మములు సత్యాసత్యములు ద్వైతాద్వైతములు జీవ బ్రహ్మములు ప్రకృతిపురుషులు ఏకవృక్షారూఢ పక్షిద్వయము మున్నగు ద్విత్వములయందలి ఏకత్వము సమగ్రముగ మాటలకోటలో నుంచవల యునని తలంచుట నిసర్గపురుషాపరాధ ప్రమాదభూయిష్ఠమై యుండు టంబట్టి బుద్ధియోగము నాశ్రయించి పురుషోత్తమ దివ్యచరణారవింద ధ్యానము విస్మరింపక జీవయాత్ర చక్కగ నడిపించుకొనుమని మానవుల నుద్ధరింప నుపదేశించుటకై వేదములు, వేదాంతములు, గీతలు ప్రస్థాన త్రయము ప్రయోజనవంతములై ప్రచలించినవి. కావున దానికై యత్నముగావింపుడు. ప్రవేశమే పరమార్థముగాని అదియే ఇదియనుట, ఇదియే యదియనుట పరమార్థముకాదు. ఇతి శివమ్.

ఇది ఈశావాస్య - మాండూక్యోపనిషత్తులకు బ్రహ్మశ్రీ మహాకవి
కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారిచే ప్రోక్తమైన
ఆంధ్ర తాత్పర్య వివరణము

సమాప్తము

ఓమ్ తత్ సత్

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.